శ్రీ

# అలమేలుమంగాపరిణయము

( పద్యకావ్యము )

మహాకవి

శ్రీ తూము రామచంద్రావనీపాలప్రణీతము

పరిష్కర్త

శిరోమణి ఆంధ్రవిద్వాన

కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

తెలుఁగు పండితుడు.

సిటీ కళాశాల

హైదరాబాదు.

ప్రకాశకుఁడు

తూము రామకృష్ణారెడ్డి దేశముఖు

మానాజీపేట

మహబూబునగరము జి.

1949



వెల రు. ౧—౦—౦



గ్రంథప్రకాశకులు:

తూము రామకృష్ణారెడ్డి దేశముఖ్;

హానవతిపేట.

# తొలిపలుకు

ఈగ్రంథమును రచించినమహాకవి మహబూబునగరమండలము లోని మానాజీపేటరాజులలో మేటి. ఇతఁడు సంస్కృతాంధ్రపాథోధిం దఱచి యీ కావ్యామృతమును వెలువఱచెను. ఈకావ్యముఁ జదువఁ జదువ సహృదయులకుఁ బరమాహ్లాదము జనించును. ఈ కృతిదర్పణమునఁ గవీంద్రునిపాండితీరసజ్ఞతలు గోచరించును.

ఈతఁడు తూమువంశసంజాతుఁడు క్షేత్రపాలసగోత్రుఁడు. ఈ వంశములోని రాజులు యోగులు, జ్యోతిర్విద్యాపారంగతులు, పండితులై యున్నారని యిప్పటికిని బసరగ్రామవాసులు చెప్పికొనుచుందురు. ఈ గ్రంథకర్త పండితకవీంద్రుఁడై పండితకవుల కనేకుల కాశ్రయ మిచ్చెను. ఇతఁడు శ్రీరామభక్తాగ్రేసరుఁడు. శ్రీరాముఁ డీతనికిఁ గలలోఁ గాన్పించి యీ గ్రంథరచన కాజ్ఞ నిచ్చె నని కవి గ్రంథాదినిఁ జెప్పికొనినాఁడు. శ్రీరామచంద్రకరుణాకటాక్షలబ్ధకవితాధురంధరుఁడై యీతఁడు పోతనామాత్యునిఁ బోలి తనకావ్యమును శ్రీరామున కంకిత మొనర్చి ధన్యుఁ డయ్యెను. ఇందు లక్ష్మీవేంకటేశ్వరులప్రణయకలహము మొదలు అలమేలుమంగాపరిణయమువఱకు వర్ణింపఁబడినది. ఈగ్రంథకర్త మఱియు నీతని యక్కగారగు రామమ్మగారు భాగవతోత్తములై శ్రీరంగాదిపుణ్యక్షేత్రములు సేవించి వచ్చి తమస్వగ్రామముకడనే యంజనగిరి యను చిన్న గుట్టపై శ్రీవెంకటేశ్వరస్వామియాలయము నిర్మించి స్వామినిఁ బ్రతిష్ఠించిరి.

ఉక్కలశ్రీరంగాచార్యులు గ్రంథకర్తకు గురువు. వారివలనే సంస్కృతాంధ్రము లభ్యసించి వారితోడ్పాటుచేసి కావ్యమును విరచించెను. కావ్యము మిగులఁ బ్రౌఢశైలిని విలసిల్లుచుఁ బ్రాచీనమహాకావ్యములను దలఁపించుచున్నది. ప్రతిపద్యము భక్తిరసభరితమై యున్నది. ఉదయాస్తమయాదివర్ణనములు చదువునప్పుడు కవికల్పనానైపుణి యచ్చెరువు

గొల్పును. శ్లేషాద్యలంకారములు పెక్కుతావుల గోచరించును. పండితైక భేద్యము లగు ఘట్టము లిందుఁ జాల వెలసిల్లినవి. వర్ణనాంశములు, కల్పనలు మనోహరములుగ నున్నవి. కవితాధార గంగాప్రవాహమువలె విరాజిల్లి యర్థపుష్టి వీడనిపదజాలముతో బంధురమై నిరర్థకపదరహితమై విరాజిల్లిన దీపవిత్రికావ్యము. పెద్దన, భట్టుమూర్తి, శ్రీనాథాదులపోకడ లీకావ్యమునఁ బెక్కుతావుల గోచరించును.

మచ్చునకు "చని చని కాంచె ముందట మనోరమణీరమణీయ కాంతియున్."

"కలకంఠనికరసత్కల కంఠ రావముల్
కలకంఠి యొనరించు గాన మేమొ".

"స్తంబేరమస్తనంధయగండకండూతి
హరణనఖాగ్రహర్యక్షగణము"

"అలరె వసంత మంతట లతాంతశిలీముఖకుంతజాలకో
త్కలితవనాంతకాంతపరికల్పితకుంజనిశాంతకాముకీ
లలితరతాంతఘర్మసలిలప్రజసంతతవారణోజ్జ్వల
న్మలయసమీరకీరపికమాధుకరాదివిహారహృద్యమై"

"చరమసర్వంసహాధరశిఖాగ్రంబునఁ
బుష్పితకింశుకభూజ మనఁగ"

"ప్రాచీదిశాంగనాభాసురహస్తాబ్జ
కలితమాక్తికకందుకం బనంగ"

ఈమున్నగువర్ణనాభాగములు పరిశీలించుసహృదయుల కిది ప్రౌఢబంధ మనియుఁ గల్పనాచాతురీబంధుర మనియుఁ దోఁపక మానదు. కవిత సలక్షణమై నిర్దుష్టమై యలరారినది.

క్రీ. శ. ౧౯వ శతాబ్ది తొలిభాగములోనివాఁడును, ఆసఫు జాహీనవాబుల ప్రధానమంత్రిగాను నుండిన రాజాచందూలాల్ ఈకవి ప్రతిష్ఠించిన వెంకటేశ్వరస్వామికి షహాపురము అను గ్రామమును అగ్రహారముగా నీతనిపేర నిచ్చినట్లు భూదానపత్రము తెల్పుచున్నది. ఇది యితనికాలమున కాధారము. ఇతఁడు పరమోదారగుణోపేతుఁడు, పరయోగి, భాగవతోత్తముఁడు, పండితకవి, యని యిప్పటికిని ప్రఖ్యాతి గలదు.

ఈకవికి మనుమఁడు శ్రీరామచంద్రారెడ్డి తనకు సంతతి లేనందున గ్రంథకర్తసోదరుని సంతతిలోనివాఁడగు శ్రీరామకృష్ణారెడ్డిని దత్తపుత్రునిగా స్వీకరించి తనరాజ్యమున కధిపతిఁగాఁ జేసెను. ఈదత్తపుత్రుఁడీగ్రంథమునకుఁ బ్రకాశకుఁడు.

## గ్రంథకర్త వంశవృక్షము



ఈపవిత్రమహాకావ్యమును శ్రీరామకృష్ణారెడ్డిగారు నాకడకుఁ దెచ్చి దీనిని సవరించి యచ్చు వేయింపుఁడని నన్ను గోరిరి. ఈగ్రంథ మామూలాగ్రము తాళపత్రములలో వ్రాయఁబడి యుండెను. అచ్చటచ్చటఁ దాళపత్రములు శిథిలములై యుండెను. వ్రాఁతలోఁ గూడఁ జాల తప్పులుండెను. అస్ఫుటములైన యక్షరములతోఁ గూడినయీ కావ్యమును జాగ్రత్తతోఁ బరిశీలించి పరిష్కరించి ముద్రణమున కిచ్చితిని. తెలంగాణములో నొకశతాబ్దికిఁ బూర్వ మవతరించిన యీ యుత్కృష్ట కావ్యమును బ్రకటింపఁ జేసి శ్రీరామకృష్ణారెడ్డిగారు తమపూర్వుల కీర్తిని దేశగౌరవమును బ్రకటించిన ధన్యజీవులు. ఆంధ్రులకృతజ్ఞతకుఁ బాత్రులు.

చ॥ కవికులతల్లజుండు తెలంగాణము నేలినరామచంద్రభూ
ధవుఁ డసమానమోక్షఫలదం బగుకావ్యపుపంట నిచ్చె; ద
త్ప్రవిమలభాగధేయము నపారముగా నిఖిలాంధ్రలోక స
త్కవులకు బంచినట్టిసముదారునిపున్నెము నెన్న శక్యమే?

—కప్పగంతుల లక్ష్మణశాస్త్రి.



ఓమ్

## ప్రథమాశ్వాసము

### ఇష్టదేవతాస్తుతి.

శా॥ శ్రీమద్భూమితనూభవాకుచలసత్సిందూరపంకాంకితో
ద్దామస్ఫీతభుజాంతరుండు, రవిసంతానాబ్ధిరాకాసుధా
ధాముఁ, డుజ్జ్వలసుందరుండు, సతభక్తవ్రాతమంగారుఁ, డా
రామక్ష్మాధిపుఁ డస్మదీప్సితములన్ రంజిల్లఁగా నీవుతన్. ౧.

చ॥ తనకు విభుండు రామవసుధాధవుఁ డౌట నిజం బటంచు నా
యనఘునిదోఃప్రతాపము దిగంతములన్ వెలయించుఁ గోర్కెచేఁ
గనకమహీధ్రచాపుఘనకార్ముకభంగ మొనర్పఁ జాలురా
ట్తనయయు వరింతు నం చనినధారుణికన్యక మమ్ముఁ బ్రోవుతన్. ౨.

ఉ॥ అన్న దశాననుఁ గూల్చుటకు నై జనకాజ్ఞ నెపంబుఁ జేసి య
త్యున్నతిఁ గాన కేగునపు డుజ్జ్వలపాదుక లాశ్రయించి తా
మన్ననతో సపర్యలు సమంజసవృత్తినిఁ జేయుచున్న శాం
తు న్నతభక్తరక్షణరతున్ భరతు న్నిరతంబుఁ గొల్చెదన్. 3.

శా॥ శ్రీరామానుజమండలాంచితకరశ్రీశాలిఁ, గీర్తిచ్ఛటా
స్ఫారోదంచితలక్షణున్, దరణివంశప్రదీపరాట్భశిన్,
శ్రీరామానుజమండలాశ్రయలసచ్ఛృంగారగాత్రోజ్జ్వలున్,
శ్రీరామానుజుఁ డైనలక్ష్మణుని నే సేవింతు నశ్రాంతమున్. ౪.

మ॥ లవణోదగ్రమహోగ్రవిగ్రహనిరమ్లానాటవీవిస్ఫుర
ద్దవవైశ్వానరసన్నిభుండు, నతసంతానైకసంతానభూ
భవసంకాశుఁడు, రామచంద్రపదసద్భక్తిప్రమోదాంతరం
గవిలాసుం డగులక్ష్మణావరజు సుజ్ఞానాంబుధిన్ గొల్చెదన్. ౫.

సీ॥ తనుతెప్ప వేసినంతనె కంధి లంఘించి,
నిన్ను గాంచి సువార్త విన్నవించె;
ఘనబలోద్ధత్యసంకలితుఁడౌ సుగ్రీవు
తోడ సఖ్యము నొనఁగూడఁ జేసెఁ;
బాకాభియాతిజిద్భీకరశక్తిపీ
డితుఁ డైనతమ్ముని బ్రతుకఁ జేసె,
సాంపరాయోదగ్రశర్వరీచరకోటిఁ
బెనుముష్టికోటులఁ దీఁచ మణఁచె;

తే॥గీ॥ ననుచు శ్రీరామభూమీంద్రుఁ డవనిజాత
తోడఁ జెప్పఁగ వినుచు సంతోషి యైన
యమితమతిమంతు, ఘనశాంతు, నతికృతాంతు,
నమలగుణవంతు, హనుమంతు నభినుతింతు. ౬.

కం॥ సుగ్రీవుఁడు, దళితారిచ
మహాగ్రీవుఁడు, రావణాదిమూర్ఛాకృద్ధ్వా
సగ్రీవుఁడు, శ్రీరామై
కగ్రీవుఁడు మమ్ముఁ బ్రోచుఁ గారుణ్యమునన్. ౭.

కం॥ భీషణవైరిచమూవి
ద్వేషణు, హితబంధుమిత్రబృందావన సం

తోషణుఁ, ద్రయ్యంతార్థా
న్వేషణు గుణకలితహృద్విభీషణుఁ గొలుతున్. ౮.

మ॥ దురితోదగ్రనిశాటకోటితుషనిర్ధూత్యుగ్రఝంఝానిల
ద్వరశౌర్యోన్నతశౌర్యధుర్యుఁడు, లసద్వాలాగ్రవిక్షేపదు
ర్భరపాతోడుచయుండు, రామపదసద్భక్తిప్రమోదుండు, సొ
హరివాహిన్యధిరాజు నంగదుని నే నాసక్తితోఁ గొల్చెదన్. ౯.

మ॥ ఘనసంఛన్నకుహూనిశోపమలసద్గాత్రుండు, క్ష్వేళాట్టహా
సనిశాటాధిపకామినీనికరభాస్వద్భ్రూణనిర్భేదనుం,
డినవంశార్ణవసోమరామచరణాబ్జేందిందిరప్రాయుఁ, డ
య్యనఘప్రాభవుఁ డచ్ఛభల్లపతి మా కైశ్వర్య మిచ్చున్ గృపన్. ౧౦

మ॥ తనఫాలాక్షిబృహన్మరీచిమహితద్రాఘిష్ఠకీలావళిచే
తను భక్తవ్రజకిల్బిషౌఘమును నిర్దగ్ధంబుఁ గావించి పా
వనులన్ జేసినకీర్తిభూతికలనన్ వర్ష్మంబు వ్యాపించెనో
యన దేహద్యుతి మించుశంకరుఁడు మా కైశ్వర్య మిచ్చున్ గృపన్. ౧౧

సీ॥ ఏమాత హైమాద్రిజామాతసామేన
సామేన లియ్యకొమై సంతసించె;
నేకాంత విభునిచే నేకాంత మగుమంత్ర
మంత్రార్థసారభూమంబుఁ దెలిసె;
నేతల్లి మహితసాధ్వీతల్లజం బని
సర్వసర్వంసహాస్తవముఁ గాంచె;
నేరామ సుమనోమనోరాము శ్రీరాము
నన్నామ మేప్రొద్దు సన్నుతించె;

తే॥గీ॥ నీదృశామలగుణగేయ, మృడునిజాయ,
మహితమేచకరుచికాయ, మానసహాయ,
దళితరిపుమాయ, నతకల్పతరునికాయ,
సర్వమంగళ మాకు నైశ్వర్య మొసఁగు. ౧౨.

ఉ॥ ఎన్నఁడు లేనివింత యిది యే మొకొ శౌరికి నాభిపద్మమం
దున్నతిఁ జిన్ని బాలుఁ డొకఁ డుద్భవమందెను, వీనిఁ జూచినన్
గన్నులపండు వయ్యె నని కాండజవాసిని గారవింపఁగా
సన్నుతి కెక్కు కర్బురపిచండునిఁ గొల్చెద నిష్టసిద్ధికై. ౧౩.

ఉ॥ నేమముతోడఁ గొల్చెద వినిర్మలవిగ్రహనిర్జితాబ్ధిరు
ట్సామజ, సామజారి, సురసాలకిసాల, విశాలచంద్రికా,
హైమనగేంద్ర, చంద్ర, శర, హీర, సరీసృపరాజ, హీర వా
గ్భామను మత్కవిత్వము విభాసుర మొందఁగఁ జేయ నిత్యమున్. ౧౪.

చ॥ జనకభుజద్వయాగ్రములఁ జక్కఁగ నిల్చి తదుత్తమాంగమం
దునఁ గలవాహినీవిమలతోయములన్ దననీడఁ గాంచి నా
యనుజును మీఁదఁ బెట్టుకొనె నప్ప యటంచును దల్లితోడఁ జె
ప్పిన నగి బుజ్జగింపఁగను బ్రేమఁ జెలంగుగణేశుఁ గొల్చెదన్. ౧౫.

గురుస్తుతి.

ఉ॥ శ్రీమహిళేశపాదసరసీరుహభక్తుఁడు శేషయార్యుఁడున్
రామషడక్షరీమనుపరాయణధుర్యునిఁ జేసి మిక్కిలిన్,
బ్రేమఁ గవిత్వమున్ భువినిఁ బెద్దలు మెచ్చ రచింపఁ జేసె న
న్నామహనీయమూర్తికిని నంజలి మోడ్చెద నిష్టసిద్ధికై. ౧౬.

సుకవి స్తుతి.

సీ॥ రాజితాదిమకావ్యరచనావిలాసభా
సురుఁ డైనప్రాచేతసుని నుతించి,
భారతామ్నాదిపౌరాణకల్పనా
సురుచిరుఁ డైనవ్యాసునిఁ దలంచి,
వేదాంతశాస్త్రసంవేది ఘంటాంశసం
జాతు దేశికవర్యు సరసు నెంచి,
లాలితనాటకాలంకారనైపుణ్య
ఘనుఁ డైనకాళిదాసునకు మ్రొక్కి,

తే॥గీ॥ శబ్దశాసన, శ్రీనాథ, శంభుదాస,
సోమ, భాస్కర, తిక్కనసోమయాజి
ముఖ్యసుకవీశసంతానములకు మోద
మొదవ నంజలిఁ గావించి మదిఁ దలంచి, ౧౨.

కుకవి నింద.

కం॥ దుర్దమకవితానిపుణక
పర్దులఁ బొడఁ గాంచి పిదపఁ బరుషరసను లా
దర్దురనిభకుకవుల కల
గర్దప్రియము మదీయకావ్యము చూడన్. ౧౩.

వ. ఇట్లస్మదీయాభీష్టదేవతావందనంబును,బురాతనకవిస్తోత్రంబును, దుష్కవినిరాకరణంబునుఁ గావించి యమందానందసందోహకందళిత బంధబంధురం బగునొక్క మహాప్రబంధంబు రచియింపం బూని యేతత్కృతి

కన్యకాలలామంబునకు సర్వపురుషోత్తమాన్వేషణంబుఁ గావించి పొడఁ
గానక క్షణోన్మీలితాక్షియుగళుండ నై కూర్కుఁ గని యున్నసమ
యంబున. ౧౯.

## భగవత్సాక్షాత్కారము.

సీ॥ తనగాత్రధారాళధారాధరము చెంతఁ
దటిదంకురచ్ఛాయతరుణి మెఱయఁ;
దనభుజార్గళకల్పతరువేష్ట్యమాన స
ద్వల్లీవిధంబు కోదండ మమరఁ;
దనయుత్తమాంగమందున నగాగ్రోదయ
మహితాబ్జహితుభాతి మౌళి దనరఁ;
దనదివ్యముఖమహోత్పలవైరిఁ జంద్రికాఽఽ
వళిరీతిఁ జిఱునవ్వు గులుకుచుండ,

తే॥గీ॥ మణిగణోజ్జ్వలకేయూరమకరకుండ
లాఽఽదిభూషణభూషితుఁ డైనరాజ
ముఖ్యుఁ డొక్కఁడు వేంచేసి మోద మెసఁగ
నెదుట నిలుచుండి కృపతోడ నిట్టు లనియె. ౨౦

కం॥ స్థిరముగ నలమేల్మంగా
పరిణయము రచించి మాకు భాసురభక్తిన్,
జరణముల సమర్పించిన
నురుతరబహుభాగ్యసుఖము లొదవును నీకున్. ౨౧.

తే॥గీ॥ అనుచు నానతి యిచ్చినయంతలోన
ధనము దొలఁకిననిఱుపేదమనుజుకరణి

నలరి సీతాసమేతుఁ డయ్యనఘుఁ డౌటఁ
దెలిసి నుతియింపఁగా నేను దలఁచి యప్పుడు. ౨౨.

దండకము.

శ్రీమత్సుధాఽంభోధికన్యాఽంశసంజాతసీతాసతీదివ్యచేతస్సరోజాతమిత్రా! మహోద్దండచండోద్యదంహఃకదంబప్రవల్లీలవిత్రా! సుమిత్రాతనూజాఽదిసద్భ్రాతృవాత్సల్యసౌశీల్యనిత్యాభిరామా! రమాకామినీనాథ! తారేయభల్లూకరాడంజనానందనాఽద్యైకకీశాధిరాజస్యసంస్తూయమానప్రతాపోజ్జ్వలద్దీర్ఘబాహాఽర్గళాత్యంతధామా! హిమాహార్యపుత్రీవరాత్యంతనైర్మల్యజాప్యనామా! హయగ్రీవరక్షశ్చరాధ్యక్షదుర్వారకాఠిస్యశారీరసంహారపాఠీనరాజాత్సువతారా! లసత్క్షీరవారాశిమగ్నస్థిరాధారణోద్ధారధౌరేయఘౌల్యాధిరాజావతారా! క్షమాయోషిదక్షీణకక్షాంతచామీకరాక్షాద్భుతాఖర్వగర్వాపహారోన్నతస్తబ్ధరోమావతారా! క్షితివ్యోమపాతాళసంవాసకృచ్ఛేతనత్రాసదోర్వీర్యదుర్ధర్షహైరణ్యవక్షఃకవాటచ్ఛిదాఽరంభగంభీరశుంభన్నఖవ్రాతదీప్యన్నృహర్యక్షదివ్యావతారా! స్ఫురత్సర్వదిఙ్మండలాంతైకపూర్ణీకృతభ్రాజితోదారదానాతివిఖ్యాతవైరోచనిద్యోతమానోత్తమాంగానుషంగానురంజన్మణీమంజుమంజీరసంజాత సంరావయోగీంద్ర హృత్పద్మసంశోభిపాదాబ్జకుబ్జావతారా! సదాఽమందబందీకృతోదగ్రపౌలస్త్యసాహస్రబాహూల్లసత్కార్తవీర్యార్జునచ్ఛేదనాత్యంతధారాళధారాసముత్తుంగజృంభత్కుఠారోజ్జ్వలజ్జామదగ్న్యస్వరూపావతారా! సదైరావణాఽరోహణాఽద్యష్టదిక్పాలవిద్రావణాక్షుద్రనిర్నిద్రకౌదోర్విల్లసద్రావణాకుంఠకంఠాఽవళీలుంఠనోద్దామరామావతారా! నృశంసావతంసాతిహింసారిరంసాప్రశంసాఽంసకంసాఽదిదుర్వంశవంశాటవీదావకీలాకరాళాయమానానుజానూనసాహాయ్యఖేలన్మహోత్తాలతాలాంకముఖ్యావతారా! త్రిపూర్ధామసాధ్వీవ్రతాధ్వప్రవి

ధ్వంసనాజస్రరాద్ధాంతబుద్ధావతారా! కలిప్రేరితాఘౌఘకర్మవ్రజోపేతదుర్మా
నుషాధీశశుష్కావళీతూలజంఝాసమీరత్కనత్కల్కిభవ్యావతారా! మన
స్సంభవానేకకోటిభ్రమానూనలావణ్యసమ్మోహనాకారలోకైకవీరా! మ
ణిస్ఫారకోటీరకేయూరహారా! సువర్ణాద్రిధీరా! బుధాళిందమందార! శ్రీరా
మచంద్రా! మదీయాపదుర్వీధరవ్రాతదేవేంద్ర! సత్కీర్తిసాంద్రా! నమస్తే;
నమస్తే,నమస్తే; నమః. ౨౩.

క॥ ఆచంద్రార్కస్థాయిగ
నీచంచద్గ్రంథ మెసఁగ నినకులనాథా!
ప్రాచేతసుఁ డొనరించిన
నీచరితముకరణిఁ బ్రోవు నిశ్చలకృపతోన్. ౨౪.

మ॥ అని యీరీతి నుతించినంతనె కృపాయత్తైకచిత్తంబుతో
ఘనగర్జాయితబంధురధ్వనుల నుత్కంఠుండునై సాదరం
బున నాచంద్రదినేంద్రతారకముగా మోదంబుతో నీకృతిన్
దనరన్ బ్రోచెద నంచుఁ బల్కి యతఁ డంతర్ధానుఁడై నంతటన్. ౨౫.

వ॥ జాగరూకుండనై లేచి నిలుచుండి యమందానందబాష్పాం
బుధారాసందోహదిగ్ధగాత్రుండనై మదీయాప్తవిద్వద్బృందంబునను నేత
త్స్వప్నప్రభావంబు వివరించిన వార లత్యంతసంతుష్టాంతరంగులై యి
ట్లనిరి. ౨౬.

## కవివంశావతరణము.

ఉ॥ నీమహనీయపూర్వకృతనిర్మలపుణ్యవిశేష మెట్టిదో?
యే మని చెప్ప వచ్చు జగదీశ్వరుఁ డారఘురాముదర్శనం

బీమహిం నీకుఁ గల్గె నిఁక నేమిటఁ దక్కువ?కావ్య మిప్పుడే
ప్రేమ రచింపు శ్రేయము లభించు”న టన్నది భాగ్యమే కదా! ౨౭.

చ॥ వినుము నరేంద్రచంద్ర!మును విక్రమధుర్యులు మీకులంబునన్
ఘనతరకీర్తిసంపదలు గల్గి ధరావలయంబు నేలుచున్
వినయము మీఱ దేవగణవిప్రపదాంబుజభక్తియుక్తులై
యనితరభోగభాగ్యమహిమాఢ్యు లనంగఁ జెలంగి రిద్ధరన్. ౨౮.

తే॥గీ॥ కాన భవదీయసంతతిక్రమము నెల్ల
వినుము వినిపించెదము నీకు విష్ణుమూర్తి
నిండుదుగ్ధాబ్ధిలోనఁ బరుండి నరుల
నొసరఁ గల్పించునిచ్ఛచే నొక్కనాఁడు. ౨౯.

కం॥ తనముఖమున భూదేవుల
నను వొందఁగ భుజములందు నచలాధిపులన్
ఘను లగువైశ్యుల నూరుల
నొసరన్ గల్పించి యంబుజోదరుఁ డంతన్. 30.

కం॥ నారదముఖసంయమివర
ధీరులకును నంద రానిదివ్యామలప
త్సారసములయందును భా
గీరథి శూద్రుల సృజించి కృప నిట్లనియెన్. ౩౧.

చ॥ అమితదురంతకిల్బిషగణాళి దళింపఁగఁ జాలుసట్టియా
సుమహితజహ్నునందనికి సోదరులైతిరి కాన మీరు నై
గమములఁ బఠింపకున్న ననఘప్రణీభావాన్వితు లౌదు రైన మ
ద్విమలపదాబ్జభక్తి మది విస్మృతి నొందక యుండఁగాఁ దగున్. ౩౨.

చ॥ అనుచు వచించినంతనె మహాద్భుతహర్షసముద్రమగ్నులై,
యనఘయశోధురంధరులు నైరి తదుజ్జ్వలవంశసంభవుల్
మనునిభకీర్తిమంతు లసమానగుణాఢ్యులు, వారిలోనఁ బెం
పొనరఁగఁ 'దూము'వంశమున నుద్భవమందెను 'నయ్య'నాఖ్యుఁడున్. 33.

సీ॥ లోచనశ్రవణరాడ్గోచరనైచికీ
దివ్యతేజస్స్ఫూర్తి ధిక్కరించి;
రాజరాజితమౌళి రాజహంసాఽవళీ
ప్రథితకాంతిచ్ఛటల్ పరిహసించి,
కాండభృద్గంధర్వకాండ వేదండపాం
డిమరమ్యదీప్తిపోడిమి యడంచి,
హైమభూభృత్సార్వభౌమసౌరద్రుమ
ప్రతిభావిభూతి తిరస్కరించి,

తే॥గీ॥ కాండభాండాంతరము నిండ నిండి వెండి
కొండపై సందడ గొని చంద్రమండలంబు
బెండుపడఁ గీర్తి వడసె నుద్దండమహిమ,
రిపుదళనహేతి 'యయ్యపురెడ్డి'నృపతి. 34.

శా॥ ఆరాజన్యుఁడు ధాత భారతినిఁ గల్యాణంబు నొనైఖరిన్
నారీరత్నము 'జాసమాంబికను' విన్నాణంబుగాఁ బెండ్లియై,
ధీరోదాత్తగుణోత్తరప్రథితవిస్తీర్ణప్రభావాఢ్యులౌ
మారాకారకుమారయుగ్మమును సంపన్నుండు గాంచెన్ దగన్. 35.

కం॥ ఆయిద్దరిలో 'వెంకట
రాయుఁడు' జ్యేష్ఠుం డతండు రాడ్వినుతుం డై,

శ్రేయోఽభివృద్ధిఁ గాంచెను;
నాయనయనుజుండు 'బచ్చ'నాఽఖ్యం దలఁపన్. ౩౬.

సీ॥ కువలయాధిపుఁ డౌటఁ గువలయాధిపుల ను
ద్దామయశోధురంధరత మించె,
గోపాలవరుఁ డౌట గోపాలవరులను
వరబుధావనవైభవమున మించె;
భూమిభృద్ఘనుఁ డౌట భూమిభృద్ఘనులను
హరిభక్తిపటుధైర్యగరిమ మించె;
ధారుణీశ్వరుఁ డౌట ధారుణీశ్వరులను
క్షమ సర్వమంగళాఽఽసక్తి మించె;
తే॥గీ॥ ననుచుఁ బార్థివనివహంబు వినుతి సేయ
భూమిఁ బాలించుచును మహాభోగ మందె,
రాజమాత్రుండె యారాజరాజహేళి
భవ్యగుణపాళి బచ్చభూపాలమౌళి. ౩౭.

శా॥ పంచేషుప్రతిమానరూపుఁ డగునాబచ్చాచలాఽధీశుఁడున్,
నాంచారమ్మను బెండ్లి యాడి విలసన్నాగారిశౌర్యోద్ధతో
దంచద్దోర్యుగవిక్రమప్రకటవిఖ్యాతప్రభావాఽఢ్యులన్
గాంచెన్ గాంచనశైలధీరు లగుప్రజ్ఞావంతులన్ ముగ్గురన్. ౩౮.

తే॥గీ॥ వారియందును 'పెదరామ' ధారుణీశుఁ
"డరిధరాఽధీశవేదండవరచయాగ్ర
హరి" యటంచును బార్థివు లభినుతింప,
వసుధఁ బాలించెఁ బురుహూతవైభవమున. ౩౯.

ఉ॥ కూరిమి ముగ్గురందుఁ గడగొట్టు,ధరాసతిపుత్రిబొట్టు,బల్
ధీరతఁ బైఁడిగట్టు,మహీధీకులపాలిటివేల్పుచెట్టు,శృం
గారమునన్ రతీశుతలకట్టు,మదోద్ధతశత్రుపాళికిన్
దీఱనికుట్టుకుట్టు,రవితేజుఁడు 'సింగ'నృపేంద్రుఁ డొప్పెడున్. ౪౦.

కం॥ మూర్తిత్రితయమునందును
నార్తత్రాణుండు సైనహరిపోలిక స
త్కీర్తిధురంధరుఁ డరిసమ
వర్తియు నగు 'చిన్నరామ' పార్థివుఁ డెసఁగున్. ౪౧.

మ॥ కదనక్షోణిని శత్రుసేనల బలాత్కారంబునన్ మూర్ధముల్
చదియన్ మోది నృపాగ్రణుల్ పొగడఁగా క్ష్మాదేవి కాహారమున్
ముద మొందంగ నొసర్చి రాజ్యము మహాపూజ్యంబుగా నేలె నె
మ్మదిలో నించుక శంక లేక నృపసన్మాన్యుండు విఖ్యాతిగన్. ౪౨.

సీ॥ ద్విజవరచక్రనీడజపంక్తిమిత్రుండు,
విద్వచ్చకోరాళిసద్విధుండు,
హితనీలకంఠసంహతిమేఘబృందంబు,
దీనబుధవ్రాతదేవసురభి,
మార్గణపికజాలమహితవసంతంబు,
శరణాగతకురంగశాద్వలంబు,
విలసదాశ్రితకీరఫలయుక్తవనపాళి,
సామంతనిర్జరసమితివజ్రి,

తే॥గీ॥ యేతదుజ్జ్వలగుణమణిజాతములకు
బరిణె యన మించె ధరణిలోఁ దరణికరణిఁ

కరుణ నిండినవరుణునిశరణ మనఁగఁ
జిన్న రామావనీపాల శేఖరుండు. ౪౩.

తే॥గీ॥ 'సదిరె' వంశాబ్ధిపరిపూర్ణవిధుఁ డనంగ
నంగభవభంగసేవాసుసంగతుండు
నైన హనుమంతరెడ్డిభార్యావతంస
'పాపమాంబకు' 'సంజమ్మ' ప్రభవ మందె. ౪౪.

ఉ॥ ఆమెను బెండ్లి యాడె విబుధాధిపజాలము మేలుమే లనన్
'దామ'కులోజ్జ్వలప్రథితదుగ్ధఝషధ్వజపూర్ణరుక్సుధా
ధాముఁడు చిన్నరామవసుధావరుఁ డర్మిలిఁ బద్మసూతి వా
గ్భామను బెండ్లి యాడుగతి భాసురలీల సుకీర్తిధుర్యుఁడై, ౪౫.

సీ॥ సకలజనంబుల నొకరీతిఁ జూచిన
జలజవాసిని కొంత సాటి వచ్చు;
మగనిశరీరంబు సగము సేయక యున్న
సర్వమంగళ కొంత సమము వచ్చు;
బహుభాషిణి యటన్న ప్రఖ్యాతి లేకున్న
భారతీసతి కొంత పాటి వచ్చు;
బహునాళ్లు ధవుఁ బాసి నహుషునిపురి నుండ
కున్నఁ బౌలోమి నీఁ డెన్న వచ్చు

తే॥గీ॥ సర్వసమురాలు,పతిమహోత్సాహవిహిత,
మితముగా మాట లాడును,బతినిఁ బాసి
యుండఁ జాలదు క్షణ మైన నుఋగుణావ
లంబ యా'సంజమాంబ'తుల్యలు గలారె. ౪౬.

॥ ఆతన్వంగిమతల్లియందుఁ దొలిచూలబ్జంబునన్ విస్ఫుర
చ్చేతస్సంభవమాత పుట్టినగతిన్ జెల్వొంద 'రామమ్మ' వి
ఖ్యాతిన్ సంభవ మందె;నామె వెనుకన్ గంజారిభృత్సత్కృపా
జాతుం డయ్యెను 'రామ,భూరమణుఁ డంచత్కీర్తివిఖ్యాతుఁ డై. ౨౭.

"తిరుమల,శ్రీరంగ"దివ్యయాత్రలఁ జేసెఁ;
దరుతటాకాదిసంతతు లొనర్చె;
నాళువారాదుల నలరి ప్రతిష్ఠించె;
నిరతాన్నదానంబుఁ జరఁగఁ జేసె;
నగ్రజన్ముల 'కగ్రహారంబు' లిప్పించెఁ;
బతిభక్తిచే మహాప్రబల యయ్యె;
ద్విజకోటిచేత సద్యాజనముల్ సేయించె;
హరిపదాంబుజభక్తి నిరతి మించెఁ;

తే॥గీ॥ బోసఁగ నత్తింటికిని దాను బుట్టినింటి
కమితసత్కీర్తి ఘటియించె నర్థిలోక
కోటిమందారతరువనవాటి, యైన
భవ్యగుణవల్లి 'రామమాంబా'మతల్లి. ౨౮.

॥ తార్క్ష్యకేతనపదోత్తమపద్మములభక్తి
యుంచినాఁ; డఘలతల్ ద్రెంచినాఁడు;
"తిరుమల,శ్రీరంగ"దివ్యదేశములు సే
వించినాఁ;డురుకీర్తిఁ బెంచినాఁడు;
హితసార్వభౌమసంతతిచేత మన్ననల్
గాంచినాఁ;డహితులఁ ద్రుంచినాఁడు;

ధరణీసురులపాలిసురమహీరుహ మనన్
మించినాఁ;డుర్విఁ బాలించినాఁడు;

తే॥గీ॥ మంచిరూపునఁ బంచేషు నోఁచినాఁడు;
పంచమస్వరమున గాన మంచితముగ
విష్ణుసన్నిధిఁ బాడి మెప్పించినాఁడు;
ఎంచఁ దర మౌనె?'రామ'భూమీశుమహిమ. ౪౯.

సీ॥ కర్బురదానసంకలితుఁ డాతండును;
గర్బురదానసంకలితుఁ డితఁడు;
రాజశేఖరనుతప్రథితుఁ డాతండును;
రాజశేఖరనుతప్రథితుఁ డితఁడు;
శివధర్మవర్ధనశీలుఁ డాతండును;
శివధర్మవర్ధనశీలుఁ డితఁడు;
సలలితలక్షణసహితుఁ డాతండును,
సలలితలక్షణసహితుఁ డితఁడు,

తే॥గీ॥ భేద మింతైనఁ గలదే?యీపృథ్వి నెన్న
సరసగుణములచే సదృశతయె కాక
దాశరథి యైన 'శ్రీరామ' ధరణిపతికి
రసికుఁ డైనట్టియా'తూము' 'రామ'మంత్రికి. ౫౦.

కం॥ వా రిద్దరి కనుజుఁడ వై
ధారుణిసుతవిభునికృప నుదయ మై విద్యా
ద్వారముచే నుతిఁ గంటివి
సారగుణోదార! 'రామచంద్ర'నరేంద్రా! ౫౧.

ఉ॥ రాముని కర్పితంబుగ విరాజితదివ్యధునీతరంగవి
భ్రామణభావుకోచ్ఛ్రయవిభాసురవాక్కుసుమప్రబంధ మన్
దామముఁ గూర్చి భక్తిపరతంత్రమనీషుఁడ నై యొసంగుమీ
యామహితాత్ముఁ డిచ్చును మహాద్భుతసంపద లిష్టసిద్ధి గాన్. ౫౨.

వ॥ అనిన నిటలతటఘటితాంజలిపుటుండ నై యి ట్లంటి. ౫౩.

ఉ॥ చిల్కకుఁ దానె మాటజిగి జిల్కఁగ నేర్పిన ముద్దుముద్దులుల్
గుల్కఁగఁ జిల్క వల్కిన నగున్, విబుధోక్తిలసత్సుధాకణం
బొల్కఁగ నారగించి ముద మొప్పఁగఁ గావ్యము నేను సట్టులే
పల్కెద గారవించుఁడి యపారకృపన్ నను విద్వదగ్రణుల్! ౫౪.

కం॥ అనినన్ విని మీవంశజు
లనయం బీరీతి సాత్వికామలమతులే
కనుకన్ నీ వావిధమున
వినయము గలవాఁడ వనఘ! విరచింపు కృతిన్. ౫౫.

వ॥ అని యాన తిచ్చువిద్వదుద్భాసురవాగ్రీతవాక్సుధాధారాపూర పూరితపారావారోత్తుంగరంగద్గంభీరాభంగతరంగజాల విశాలడోలికల నుయ్యెల లూగి మహానందకందళితాంతరంగుండ నై వారలకు బహువారంబు సాష్టాంగనమస్కారంబు లాచరించి తదనుమతిస్వీకారంబున, ౫౬.

## కృతిసహాయకస్మృతి.

కం॥ భృంగజ్యాంచితహాపా-
భంగురపాండిత్యకావ్యభాసురగంగా

భంగస్ఫుర "దుకూల శ్రీ
రంగార్య" సహాయమునను రాజితమతి నై ౫౭

### కృతిపతి స్తుతి.

సీ॥ శ్రీధరాకన్యకాచిత్తమానసహంస!
హంసకులాబ్ధితారాధిరాజ!
రాజరాజవిమానరాజాంతరవిహార!
హారకిరీటకేయూరభరణ!
రణధైర్యధౌరేయచణదైత్యసంహార!
హారాయితాహిహస్తాబ్జపాద!
పాదపసప్తకభేదనదోస్సార!
సారంగదనుజవిశసనధీర!

తే॥ గీ॥ ధీరజనచిత్తసారసోదారసూర!
సూరనందనముఖకపిస్తోత్రమహిత!
హితనృపవ్రాతసంతతావృతనికేత!
కేతనోజ్జ్వలసాకేతజాత! రామ! ౫౮

సీ॥ కనదనర్ఘానంతకల్యాణగుణధామ!
రఘుకులాంభోనిధిరమ్యసోమ!
శరనిధీషుధిసతీసన్నుతప్రియనామ!
శతకోటిజలజాప్తసదృశధామ!
చటులవిభావరీచరవాహినీభీమ!
పటుశౌర్యనిర్జితపరశురామ!
పృథుతరప్రావృట్కృపీటధరశ్యామ!
నతజనవ్రాతదుష్కృతవిరామ!

తే॥ గీ॥ యమితసౌందర్యవిజితసహస్రకామ!
మానినీకృతపాషాణమౌనిభామ!
భవ్యసాకేతపురవరదివ్యధామ!
రావణోదగ్రగోత్రసుత్రామ! రామ! ౫౯

షష్ఠ్యంతములు.

కం॥ ఏతాదృశగుణఖనికిని,
వాతాశనచక్రిరాజవరతల్పునకున్,
సీతాఽఽతతచేతఃకం-
జాతామలరామనామషట్చరణునకున్, ౬౦

కం॥ పాటచ్చరఖేటకరిపు
పాటనభుజశౌర్యధుర్యపార్థివపతికిన్,
హాటకమయశాటికిని, ని
శాఽటజఃహాజూటసన్నుతామలధనికిన్, ౬౧

కం॥ దర్వీకరగిరోర్వీధృతి
సర్వాపహశౌర్యధుర్యనిపుణశౌర్యునకున్,
శార్వాంబకగీర్వల్లభ
పూర్వామరవైరిరాజపూజితనిధికిన్, ౬౨

కం॥ భర్గేష్వాసధ్వంసా
సర్గళబాహార్గళునకు, సంఖాదనరా
డ్వర్గామితదుర్దమతర
దుర్గర్వనిరాసశౌర్యదోస్సారునకున్, ౬౩

కం॥ రామునకుఁ, శతరవినిభ
ధామునకుఁ, నీలనీరదశ్యామునకుఁ,
సోమస్తుతనామునకుఁ,
హేమాంబరకలితదేహనృపసోమునకుఁ, ౬౪

కథా ప్రారంభము.

వ॥ అంకితంబుగా నాయొనర్పం బూనిన 'యలమేలుమంగాపరిణ
యం' బనుమహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టి దనిన. ౬౫

తే॥గీ॥ శౌనకాదితాపసలోకసార్వభౌమ
రాజి యొకనాఁడు నైమిశారణ్యమునను,
సత్రయాగంబు సలుపుచుఁ బత్రిరథుని
కథలు వినువేడ్క సూతుమొగంబు సూచి, ౬౬

కం॥ సూతా! మేధాజితభవ
సూతా! హరిపాదభక్తిసురుచిరచిత్తో
పేతా! పటుకిల్బిషచయ
జేతా! భగవత్కథావిశేషసమేతా!, ౬౭

మ॥ మును నీ వబ్జసుదర్శనాంచితకరాంభోజాతుచారిత్రముల్
వినిపింపన్ విని సంతసించితిమి; యీవిశ్వంభరామధ్యమం
బున నేతత్కలియందు రాజవరులన్ బుణ్యాత్ము లెవ్వారలో?
వినఁగా వేడుక యయ్యె; వారిచరితల్ విన్పింపు విఖ్యాతిగన్. ౬౮

మ॥ అనుచున్ వేఁడిన, రోమహర్షణి మహాహ్లాదాంతరంగుండు నై
వినతాజధ్వజుపాదపద్మములకున్ వేమాఱు స్వాంతంబునం

దు నమస్కారము లాచరించి మునిసందోహంబులఁ జూచి తా
వినయం బొప్పఁగ వారి కిట్టు లనియెన్ విభ్రాజితప్రౌఢిమన్. ౬౯

## నారదుండు కైలాసంబున కేఁగుట

ఉ॥ రాజితరాజమౌళిసురరాజముఖామరులున్ నుతింప వి
భ్రాజితకాద్రవేయచయరాడ్వలయాంగదహారయుక్తుఁడై
రాజతశైలమందు నగరాజసుతార్ధశరీరుఁడై పరి
వ్రాజకలోక మెల్లఁ గొలువన్ గొలువై యట నుండునత్తఱిన్. ౭౦.

సీ॥ తర్జనీనిర్ఘాతతంత్రీవితానసం
జాతనారాయణశబ్ద మెసఁగ,
సకలాపగాపుణ్యజలపూర్ణసౌవర్ణ
నవరత్నయుతకమండలువు సెలఁగ,
దేహావదాతదీధితిచంద్రికావళి
విస్తృతధ్వాంతంబు విరియఁ జేయ,
సలలితకాషాయశాటీస్ఫురత్కాంతి
మిహిరరత్నమునకు మెఱుఁగొసంగ,

తే॥గీ॥ వీణ వాయించుచును మహావేగముగను
గగనముననుండి వేంచేసె గరళకంఠు
కొలువుకూటంబునకు మునుల్ గొలుచుచుండ
నారదుండు రుగ్జితశరన్నారదుండు ౭౧.

కం॥ వచ్చినసంయమిఁ గనుఁగొని
మచ్చికతో శంకరుండు మంజులఫణితిన్,

వచ్చితి వెచ్చటనుండియొ
చెచ్చెర నది దెల్పు మయ్య! చిత్రం బలరన్, ౨౨.

మ॥ అనినన్, నారదుఁ డబ్జమాళికిని సాష్టాంగప్రణామంబు లిం
పెనయన్ జేసిన గారవించి, మఱి నీ విన్నాళ్లు లెం దుండితో?
వనజాతాసన కేశవుల్ మఱియుఁ దత్పత్నుల్ సుఖం బుండిరే?
వినిపింపం దగు విష్టపంబుల మఱేవింతల్ గనుంగొంటివో? ౨౩.

నారదుండు పరమేశ్వరుని స్తుతించుట

వ॥ అనిన నారదుండు, ౨౪.

కం॥ శంబరధరధర! శుంభ
చ్ఛంబరధరకరసరోజ! శశ్వత్ఖధునీ
శంబరధర! గళరుగ్జిత
శంబరధర! దృక్శుచిహతశంబరమథనా! ౨౫.

కం॥ బుధభీప్రదత్రిపురాసుర
మథనోత్సవసమయశౌర్యమండితవిలస
ద్విధిశరధిశరధిశయసా
రథిశరధినిశాతబాణరథకృతవసుధా! ౨౬

సీ॥ అలికదృగ్భవలసద్ధవ్యవాహనవిద
గ్ధాంబుజాతాస్త్రి! జోహారు నీకు;
కమలరుడ్ద్విట్స్ఫురద్రమణీయభవ్యగో
టీరసంకలిత! జోహారు నీకు;
పవనభుక్పరివృఢప్రత్యగ్రలావణ్య
హారకేయూర! జోహారు నీకు;

హిమకుభృద్వ్రతిభిత్సుమహితకన్యాము
హాసతీభర్త!జోహారు నీకు;

తే॥గీ॥ సింధురాణ్మేఖలాఽహార్యశేఖరాఽగ
మాబ్జభవసాగరానంత హైమచేల
రథసఃసుత్తుంగకోదండరథ్యనిచయ
సారథీషుధిజ్యేష!జోహారు నీకు. ౭౭.

చ॥ హర!ధరరాజచాపధర! హైమధరాధరరాజనందనీ
వర!పరవీరవారహర!వారణదైత్యనివారవీరశం
బర!కరశంబరోద్భవవిభాసుర!శంబరలోచనేట్ప్రియం
కర!శరభిన్నపూస్త్రితయకర్బుర!శంకర!నిన్ను గొల్చెదన్. ౭౮.

తే॥గీ॥ అనుచు నుతియించి యిటులు నన్నడుగ నేల?
కమలభవకేశవులు నీవె కావె? దేవ!
దేవదేవేశ!శంకర!దివ్యమూర్తి!
శివ!మహాదేవ!నే నేమి చెప్పఁగలను? ౭౯.

ఉ॥ ఐన మహానుభావ!విను మబ్జభవాండము నెల్ల నీకృపన్
నేను జరించి దైత్యహరు నీరజనాభు రమేశుఁ గేశవున్
దీనశరణ్యు నిత్యు ఘనతేజునిఁ జూడ వికుంఠధామమున్
గానము సేయుచున్ జనితిఁ గాని యతం డట లేఁడు శంకరా! ౮౦.

కం॥ ఇచ్చట లేఁ డచ్యుతుఁ డని
యచ్చట నే జనుల నడుగ సంతట వా "రా
ముచ్చట యేమో!హరి తా
నెచ్చటి కేగెనో!యెఱుంగ మే" మని రీశా! ౮౧

సీ॥ గరుడవిష్వక్సేనకాద్రవేయాధిరా
జన్యపరిముఖభక్తజనము లెల్ల,
భార్గవీసహితుఁడై భగవంతుఁ డెచటికో
మసలను వంచించి చనెనిదేమొ!
"మన్నిభంగుల మిమ్ము నెడఁబాయ"ననువాఁడు
నేఁ డేలకో విడనాడి పోయె!,
స్వామికార్యంబున నేమైన నేరంబు
గావించితిమొ! యేమికారణంబొ!,

తే॥గీ॥ లేక గజరాజువలెనె భూలోకమందు
భక్తులెవరైన విష్ణు నాసక్తితోడఁ
బ్రోమ రక్షింప రమ్మని పిలువఁ జనెనె
పోయెఁ గాఁబోలు సని వారు పోయి రభవ! ౭౨.

వ॥ కావున వైకుంఠంబున దానవారు లిక లేకుంట నావారశ్లాఘ్యైశ్వర్యశౌర్య ధుర్యుండగు శ్రీమన్నారాయణుండు లేఁడు గావున జంగమామరుచ్ఛలితదీపకళికవోలె మదీయస్వాంతంబు చలియించుచున్నయది; తద్వృత్తాంతం బరయుటకై భవత్సన్నిధానంబున కేతెంచితి ననినారదుండు మఱియు నిట్లనియె. ౭౩.

క॥ "భువి హరిరూపము శివుఁడున్
శివరూపము హరియు నెట సిద్ధం" బనుచున్,
వివరింపవే! శ్రుతిమాతయు
భవ! భేదము మీకుఁ గలదె! పరికింపంగన్. ౭౪,

కం॥ శంకర! నతరాక్షససుర
శంకర! సమదోగ్రసామజనిశాటవినా
శంకర! తెల్పవె! మాకుఁ
శంకరహితముగను మావశంకర! దయతోఁ. ౮౪,

తే॥గీ॥ అనుచు వేఁడినసురమానివినుతి మెచ్చి
పరమశివుఁ డనె హరిమాయ లరయ వశమె.
యైన వివరింతుఁ దెలిసినయంత నీకు
సావధానుండ వై విను సంయమీంద్ర! ౮౫.

పుర వర్ణనము.

ఉ॥ మానవతీపురంబు విధుమండలచుంబితగోపురంబు, శ్రీ
మానవతీలలామ కసమానము నై తగుకాపురంబు, త్వన్
మానినిపాదపద్మవలమానవిభాసురనూపురం బనన్
మానవనాథపుంగవసమన్వితమై చెలు వొందు ధాత్రిలోన్ ౮౬.

సీ॥ రమ్యాచిరత్నసద్రత్నచిత్రీకృతో
త్తాలసాలోత్కీర్ణతారకంబు,
చంద్రశాలానటచ్ఛంద్రాననాగాన
వివశితగంధర్వయువతిచయము,
సౌధోపరిస్ఫురచ్ఛాతకుంభోదగ్ర
కుంభశుంభితరవిజృంభితంబు,
సద్ధ్వజాగ్రనిబద్ధశాటికోద్భవవాత
శమితామరీరతిశ్రాంతిభరము,

తే॥గీ॥ నవనిధానాఽస్పదోజ్జ్వలభవన మగుచు
ధనదువీటికి సమ మని యనఁగ వచ్చుఁ
బృథులవైభవవిహసితభిదురపాణి
దివ్యనగరంబు మానవతీపురంబు. ౫౭.

తే॥గీ॥ స్వర్ణకలధౌతమయచిత్రవర్ణభిత్తి
చయముతో నొప్పునప్పురిసౌధరాజి
హేమభూధరరజతనగేంద్రయుగము
పురముఁ గన వచ్చి నిల్చినకరణిఁ దనరు. ౫౮.

అగడ్త

కం॥ అప్పురిపరిఖాఽగాధతఁ
జెప్పిన బలిచక్రవర్తి చెప్పఁగ వచ్చున్
దప్పిన గప్పిన శేషుఁడె
చెప్పఁగ వలెఁ గాని యొరులు చెప్పఁగఁ గలరా? ౫౯.

విప్రులు

కం॥ వేధోగాఢాధితన
న్మేధాపాథోధు లచటిమేదినిదేవుల్,
సాధారణు లని ధారుణి
సాధూత్తమ! వారి ననఁగ శక్తులు గలరే? ౬౦.

రాజులు

(రాజ, సూర్య, చంద్ర, హంసలకు శ్లేషము)

సీ॥ కమలాకరాఽనందకరమహోన్నతవైభ
వాంచితసంపద నతిశయించి,

భాసురానంతసత్పదవీవిహారవై
చక్షుణ్యామహిమచే సంతసించి,
సలలితద్విజచక్రసన్మానితప్రభూ
తాస్తోకవిఖ్యాతి నలరు చుండి,
కీర్తిసంతానసంవర్తనభోగవి
స్ఫురణప్రభాభూతిఁ బొల్పు మీఱి,

తే॥గీ॥ రాజహంససమానవిరాజమాన
రాజహంసగణంబు తదగ్ర్యనగర
రాజమార్గంబులన్ వలరాజు లనఁగ
సంచరించుచు నుందురు సరభసమున. ౯౧.

వైశ్యులు

కం॥ దక్షత నరయక యాదిమ
భిక్షునికడ ధనము దాచఁ బెట్టుచు నతనిన్
రక్షింపు మనుచుఁ గొల్చెడు
యక్షేశునిభాగ్య మెంత!యందురు వైశ్యుల్. ౯౨.

శూద్రులు

కం॥ హాలవిద్యాకౌశలదృఢ
బలభద్రవినిర్జితైకబలభద్రులు శ్రీ
లలనామణివరభక్తిన్
జెలఁగుదు రవ్వీట శూద్రశేఖరు లెలమిన్. ౯౩.

రథములు

క॥ తుంగధ్వజశాఖాపట
రంగత్పత్త్రములు గల్గి రథసంచయముల్
జంగమహారిచందనముల
భంగినిఁ దనరారుఁ బురి నభంగురమహిమన్. ౯౪.

గజములు.

మ॥ స్ఫురదుత్తుంగచరన్మహీధ్రనికరంబున్ బోలుఁనున్మత్తభీ
కరశుండాలసమూహ మప్పురమునన్ గన్పట్టు, వర్షాగమో
త్కరధారాధరబంధురధ్వనుల నుద్ఘాటించునిస్తంద్రని
ష్ఠురఘీంకారములన్ నృపారిహృదయక్షోభంబుఁ గావింపుచున్. ౯౫.

హయములు.

క॥ ఆజానేయము లరుణుని
వాజిసమూహముల, గంధవహుఁ దెక్కుడుబల్
తేజీల నపహసించు, వి
రాజితరంహమున నప్పురవతంసమునన్. ౯౬.

వీరభటులు

కం॥ భటులున్ రిపుకోటికి యమ
భటులున్ మహనీయశౌర్యబాహుబలమహో
న్నటులున్ జటులాస్త్రోకా
ర్భటులున్ నిజరాజకార్యపటు లుద్భటులున్. ౯౭

పుష్పలావికలు.

సీ॥ అండజయాన! నీదండఁ గోరితి నన;
తగినంత నెల యిచ్చి దండఁ గొనుము?
బటువు లౌ యీపూలబంతు లెంతేటి వన్న;
వలసినఁ గొల లేనివిలువ లివ్వి;
హార మిం పవుఁ, బుష్పహార మెత్తు మటన్న;
నిచ్చ గల్గినఁ బైక మిచ్చి చూడు;
పరువ మెప్పుడు? దీని తెఱఁగుఁల్పు మటన్న,
రాత్రిజామున మహారమ్య మగును,
తే॥ గీ॥ ననుచు నర్మోక్తులను బువ్వు లమ్ము చెలులు
విటమనోభేదిమన్మథోత్కటశరోరు
భారములఁ బూనుమదమత్తభద్రగజము
లనఁగ నలరుదు రవ్వీట నతులగతుల. ౯౮

ఆశ్వాసాంతము.

ఉ॥ భాస్కరవంశసాగరశుభచ్ఛవిరాజవిరాజమాసన
న్మస్కరిలోకసంచయసుమానసవాసనవాసనైకసో
పస్కరదేవచక్రపరిపాలనధీరనధీరకోకతే
జస్కరకోటిభాస్కరవిశాలసుధావసుధామధుస్వరా! ౯౯

మాలిని॥ జలనిధిమదశోషా! జానకీస్వాంతతోషా!
సలలితశుచిపూషా! సంయమీంద్రైకవేషా!
విలసితనుతభాషా! విచ్యుతాశేషదోషా!
బలరిపుమణిభూషా! భవ్యపర్యంకశేషా! ౧౦౦

ఇది శ్రీమద్రామచంద్రపదారవిందమరందరసాస్వాదన
'తూము'వంశపయఃపారావారరాకాసుధాకరరామ
క్ష్మాపాలసుపుత్రపవిత్రచరిత్రాత్మకృతాబంధ
గీర్వాణచణరామచంద్రావనీపాలవిర
చితశ్రీమదలమేలుమంగా
పరిణయంబనుమహా
ప్రబంధంబు
నందు
ప్రథమాశ్వాసము.



ఓం

## ద్వితీయాఽశ్వాసము.

కం॥ శ్రీసీతాహృదయాంబుజ
భాసురభసలోపమానభవ్యశరీరా!
వాసవముఖసురసన్నుత
దాసజనాంభోధిసోమ! దశరథరామా! ౧

తే॥గీ॥ అవధరింపుమ! యాపురి కధిపుఁ డెవ్వఁ
డనుచు వివరించె నారదమునికి భవుఁడు,
తెలియ సది మాకు వివరించు ధీసమేత!
సూత! మేధావిజితవారిజాతజాత! ౨

కం॥ అనుచుఁ శౌనకుఁ డడిగినఁ
గనుఁగొని సూతుండు పారికాంక్షీశ్వరుతోఁ
గనకకుభృత్కోదండుఁడు
వినిపించిన తెలుఁగు మీరు వినుఁ డని పలికెన్. 3

సీ॥ ఆజానుదీర్ఘబాహాఽర్గళయుగళుండు,
ముఖవిసర్జితశరత్పూర్ణవిధుఁడు,
వితతవిస్ఫుటలసచ్ఛతపత్రనేత్రుండు,
రమణీయకుందకోరకరదుండు,
దక్షిణాఽవర్తసుందరతరగ్రీవుండు,
హర్యక్షరాజమధ్యస్థలుండు,
సురధునీసైకతస్ఫురదురుజఘనుండు,
కందర్పతూణజంఘాద్వయుండు,

తే॥గీ॥ రాజ, నలరాజ, రతిరాజ, రాజరాజ-
తనయ, సురరాజనందనోత్కరవిరాజ
మానలావణ్యవిహసనమహితసుంద
రాంగవిభవుండు తూమురామావనిపుఁడు, ౪

సీ॥ రాజితానంతసామ్రాజ్యభోగమువాఁడు,
ప్రద్యుమ్నభవ్యరూపంబువాఁడు,
సతతధర్మప్రౌఢి నతిశయించినవాఁడు,
బహుశాస్త్రనిపుణుఁడై పరఁగువాఁడు,
పరదానసత్కృతనిరంతరచింత గలవాఁడు,
లలితాభిరామాఖ్యఁ జెలఁగువాఁడు,
విలసితాశాజయకలితశౌర్యమువాఁడు,
భద్రసంతానసంపత్తివాఁడు,

తే॥గీ॥ అచ్యుతానర్ఘ్యపదభక్తి నలరువాఁడు,
రమ్యసాకేత మేలుశ్రీరాముపగిది,
దివ్యతర మైన'మానవతీ'పురంబు
నేలుచును దూమురామభూపాలుఁ డలరు. ౫

కం॥ సీతో డాయనగానము
సీతోడనె సమఃసు వచ్చు నిశ్చయము సుమీ!
నాతోడ నైన సమమే
సీతోడ నబద్ధ మాడ నిర్మలచరితా! ౬

శా॥ ఆరాజాగ్రణి సేయుగానసమున సత్యానందచేతస్కులై
తారామార్గమునన్ విమానచరకాంతారత్నముల్ సొక్కి యా

ఔరా! గానము లిట్టు లుండ వలెగా! యీకిన్నరీగానముల్
మాఱా! దీనికి నంచు నెంచుదురు పల్మాఱంత విభ్రాంతులై. ౭

తే॥గీ॥ రామభూపాలకుఁడు సేయురాగమహిమ
శంఖనిర్గతవైణికస్వనము గనుకఁ
జిత్ర మై తోఁచె; ధరణిలో శిఖి,తురంగ, ౮
గజ, పిక, క్రౌంచ, ధే, న్వజాగణము సొక్కె.

సీ॥ కల నైనఁ బరకామినులగోష్ఠిఁ దలఁపఁడు;
గురుభక్తి నిరతంబు మఱవకుండు;
మఱచియే ననృతంపుమాట నోటికి రాదు;
హితులపైఁ గోప మేయెడను లేదు;
శాత్రవుం డైనను శర ణన్న రక్షించుఁ;
బక్షపాతము లేక ప్రజలఁ బ్రోచుఁ;
బృథ్వీసురులఁ గన్న భృత్యునివలె నుండుఁ;
గరుణ గల్గినవాఁడు;కపటి గాఁడు,

తే॥గీ॥ సకలరాజాధిరాజసంస్తవ్యదివ్య
నిస్తులాస్తోకకీర్తిప్రశస్తిఁ డైన
రామపూభూపాలుసద్గుణరాజివినుతి
సలుప నెవ్వారివశ మయ్య! సంయమీంద్ర! ౯

కం॥ చందురునెద గందఁగ హరి
చందన మాకులపడంగ సౌరద్విపముల్
మందగతి నొందఁ జేసెను
సుందరుఁ డగురామభూపుసురుచిరయశముల్ ౧౦

తే॥గీ॥ భూమిఁ గోపల నాపుణ్యపురుషవర్యు
దర్శనంబు ఘటించినధన్యతరుల
పుణ్య మింత యని గణుతించి పొగడ వశమె?
బ్రహ్మ కైనను ద్విసహస్రరసను కైన ౧౧

క॥ కృష్ణా! యని మా టాడును;
గృష్ణా! యని యెవరి నైనఁ గృపతోఁ బిలుచున్;
గృష్ణా! యని నడుచును; హరి!
కృష్ణా! యను సుమ్ము! మదినిఁ గేవలభక్తిన్ ౧౨

క॥ 'హరి! హరి!' యనుసద్వాక్యము
మఱవఁడు కల నైనఁ గాని మానీశ్వర! భూ
వరుమహిమ యెంత తెల్పుదు
హరి! హరి! హరి! యతనిభక్తి హరికే తెలియున్ ౧౩

చ॥ చిన్నతనాన నైన సరసీరుహనాభ! రమేశ! కృష్ణ! యో
పన్నగరాజతల్ప! సురపాలన! శౌరి! ముకుంద! రంగ! యా
పన్నజనార్తివార! యని పల్కుచుఁ గీర్తన సేయుఁ గాని తా
నెన్నఁడు నాడఁ బోఁడు సరియీడులపిల్లలతోడ నారదా! ౧౪

చ॥ ప్రతిదిన మివ్విధంబున నృపాలశిఖామణి భక్తియుక్తుఁ డై
యతికుతుకంబునన్ హరిపదాంబుజముల్ మది నిల్పి రాజ్యమున్
సతిసుతసోదరాదిసుఖసంతతు లెల్ల నిమిత్తమాత్రమే
సతతము సల్పుచుండు మునిచంద్ర! యతండు నరేంద్రమాత్రుఁ డై ౧౫

వ॥ మఱియు నివ్విధంబున నారాజహంసోత్తంసుండు నిజపదారవిందా
మంద ధ్యానానందపారవశ్యంబున నుండుట గోవిందుండు దెలిసి ప్రహ్లాదాంబరీ

పాఙ్గసశుకశౌనకవ్యాసపరాశరాదిపరమభాగవతశిఖామణులతోడ స
మానుం డైనయుత్తమశ్లోకుం డని యతనికిఁ దనదర్శనం బొసంగి యప్పర
మపవిత్రునిచేత సపర్యలు గైకొన వలయు నని మనంబున విచారించి
యున్న సమయంబున సింధురాజకన్యాలలామంబు నిజనాథుం డగుపురుషో
త్తము నుపలక్షించి యిట్లనియె. ౧౬

క॥ ఏతత్కలియుగమందున,
భూతలమున సకలజనులు పుణ్యవిహీనుల్,
పాతకు, లఘయుక్తులు నాఁ
జేతను లేరీతి నిన్నుఁ జేరెద? రనఘా! ౧౭

శా॥ స్వామీ! నిన్ను జనావనుం, డని జనుల్ వర్ణింతు రెల్లప్పు; డే
నామాటల్ విని సంతసింపుదుఁ గదా! యశ్రాంత మాత్మేశ్వరా!
నామా టించుక చిత్తగించి భువి నీనామంబు సార్థంబు గాఁ
బ్రేమన్ వారలఁ బ్రోవఁగాఁ దగును గుంభిస్వామిసంరక్షకా! ౧౮

వ॥ అనినన్ బురుషోత్తముం డి ట్లనియె ౧౯

క॥ బాలిక! బహుకిల్బిషజం
బాలకదంబమున మున్గుపాపపుజనులన్,
బాలింపఁ దగునె? విధుశా
బాలిక! యిది తెలియ వలదె? యలఘుమనీషన్ ౨౦

ఉ॥ నా విని పద్మగేహిని జనార్దన! నీ విటు లాడఁ జెల్లునా?
దేవరచిత్త; మీజనులది క్కిఁక నెవ్వరు? మీరు గాక; నా
భావముఁ జూత మం చిటులఁ బల్కెద రింతియె కాని; దీనులన్
బ్రోవక మీకు దీనజనపోషణకీర్తి యిఁ కెట్లు నిల్చెడిన్ ౨౧

చ॥ అనిన మురాంతకుండు "వికచాంబుజనేత్ర! పురాకృతంబు లీ
జనులు భుజింప కూరకయె సత్పద మెవ్విధిఁ జేర వచ్చు; నా
రనిశముఁ జేయు చుండెడుమహాద్భుతపాపము లింక నేరి కా
ననుభవ మొందఁగా; భువి ననర్హులు రక్షణపాత్రు లౌదు రే!" ౨౨

వ॥ అనిన రమాదేవి యి ట్లనియె ౨౩

తే॥గీ॥ 'పతితపావన' బిరుదాంకవితతకీర్తి
గలుగుమహనీయమూర్తివి కమలనాభ!
పతితజనముల రక్షించి భద్రముగను
గీర్తి దక్కించు ఫణిచక్రవర్తిశయన! ౨౪

వ॥ అనినరమాదేవిపలుకు లాకర్ణించి శ్రీమన్నారాయణుండు భక్తవత్సలుండు గావున నిజభక్తుం డగురామభూపాలునకుఁ దనదర్శనం బొసంగు టకై భూలోకంబున కరుగం దలంచి 'నన్ను బరుషవాక్యంబు లాడెద' వని నెపంబుఁ గల్పించుకొని కోపంబున క్షీరపారావారకన్యకామణి యగునిందిరాదేవిముఖారవిందం బవలోకించి యి ట్లనియె. ౨౫

కం॥ మగువా! న న్నిటు లాడఁ
దగవా? యిఁక నిందు నుండఁ దగ దని హరి తా
జిగిబంగరుదుప్పటిఁ జ
క్కఁగఁ దాలిచి పాన్పు డిగ్గి కడుకోపముతోన్. ౨౬

మ॥ చనె వైకుంఠముఁ బాసి కేశవుఁడు చంచత్సామజాధీశ్వరా
వనకార్యార్థముఁ బోవునట్టులె, లసద్వాతూలవిభ్రాజితై
కనిరాఘాటమహాఽవిలంబితగతిన్ గంజాక్షి కంజాతగే
హిని నాథా!నను బాసి పోవఁ దగ దం చెంతేనిఁ బ్రార్థించినన్. ౨౭

మ॥ పురిలో నెవ్వరుఁ జూడకుండ హరి సంఫుల్లాబ్జనేత్రుండు వి
స్ఫురదత్యంతదయారసామృతకిరచ్ఛోభాఽమలాపాంగుఁ డీ
ధరణీభాగమునందుఁ గల్గుజనసంతానంబులన్ బ్రోవఁగాఁ
బరమోత్సాహమనీషుఁడై చనె జగత్ప్రాణాతివేగంబునన్. ౨౮

చ॥ చని చని కాంచె ముందట మసారమణీరమణీయకాంతియున్
ఘనతరచంద్రకాంతమణికాంతి, కళిందభవాభ్రగంగ లిం
పెనసి నగాగ్రమందుఁ బ్రవహించెనొ యన్న విధాన నుండు నం
జనగిరిరాజ మంతటను శౌరిమహాద్భుతమానసాబ్జుఁ డై. ౨౯

సీ॥ పటుతరోద్ధతధైర్యభర మెల్ల దిగ నాడి
యాదిభిక్షునిముష్టి నణఁగ కున్నఁ;
గలశపాథోధిలోఁ గవ్వంబువిధమునఁ
బలుమారుఁ దిరుగుడు వడక యున్న;
రాక్షసాధిపుచేత నక్షీణగరిమంబు
వదలక మొదలేమి కదల కున్న,
నొకపాటి విప్రాఽజ్ఞ నకలంకవిస్ఫుర
ద్బలము దూలుచు నేలఁ బడక యున్న;

తే॥గీ॥ నమరశైలంబు, మందరాహార్యవరాళి,
రజతశైలంబు, వింధ్యాద్రిరాజమున్న,
సాటి యన వచ్చు నంజనాచలముతోడ
ననుదు నికటంబునకు వచ్చె నచ్యుతుండు. 30

తే॥గీ॥ వచ్చి యచ్చటిశృంగారవనముచెంతఁ
గాంచె విస్ఫుటకాంచనకమలషండ

మండితాభంగభంగసత్కాండపూర
భూరిపద్మాకరము దేవపూజ్యఁ డెపుడు. 3౧

కం॥ ఆసరసీనికటంబున
భాసురసహకార, పనస, పాటల, విలస
త్కేసరకుంజాంతమున సు
ఖాసీనుం డై తలంచె నంబుధితనయన్. 3౨

సీ॥ కలకంఠనికరసత్కలకంఠరావముల్
కలకంఠి యొనరించుగాన మేమొ!;
కనకపుష్పాన్నత్యకనకసద్యుతిఁ గాంచి
కనకాంగిమేనిసత్కాంతి యేమొ!;
కాదంబవిస్ఫురత్కాదంబగమనముల్
కాదంబగామినీగమన మేమొ!;
శుకకులాంగనలప్రాంశుకలోక్తు లాలించి
శుకవాణి వలికెడిసూక్తు లేమొ!;

తే॥గీ॥ యంచు నెంచుచు దిక్కు లాలించి కాంచి
కాంచనాంగి య టంచుఁ బో ల్పెంచి యెంచి,
పంచబాణునిపాలు గావించి తంచుఁ
గించిదున్మీలితాక్షుఁ డై కేశవుండు. 33

ఉ॥ హా రమ! మద్భుజాంతరవిహార! మహాధిక మయ్యె నేమె నా
నేరమె? నన్ను నేటికి వనీరమపా లొనరించి తింతని
స్సారమ? దీని కింతటివిచారమ? నాయెడఁ గోప మింతవి
స్తారమ? మత్తపఃఫలసుసారమ! వాగ్జితదివ్యకీరమా! 3౪

కం॥ అని తనచెంతనె యొకశుక
మును గనుఁగొని వినయమునను మ్రొక్కుచు శుకమా!
వనజాలయ యెం దున్నను
జని తోడ్కొని రమ్ము పొమ్ము సదమలకృపతోన్. ౩౫

కం॥ సహకారులఫలభంగము
మహిలో నొనరించువాఁడు మఱియొకరికిఁ దా
సహకారం బొనరించునె?
యహహా! నీగుణముఁ దెలియ కంటిని శుకమా! ౩౬

కం॥ మొక మెత్తి సేయ నేటికి?
శుకమా! మొక మోట లేక సూనాస్త్రునిసా
యకబాధ కోర్వఁ జాలక
యకలంకాబ్జాఽస్యఁ దె మ్మటన్నందులకే! ౩౭

కం॥ ఇట నుండఁ దగదు మారుని
పటుతరబలచయము గలదు; పర్వతగుహలో
నెట నైన నుందు నని హరి
యటఁ జని శైలాధిరోహ మారంభించెన్. ౩౮

శా॥ శృంగాభంగపతజ్ఝరీతటనటచ్ఛృంగారగాంగేయరు
గ్రంగత్పత్త్రవిభాసురాంచలకసత్కాదంబకాదంబినీ
తుంగాఽమ్రేడితరావసాధ్వసచలద్రోలంబఝుంకారస
త్సంగీతంబుల నాలకించుచుఁ జనెన్ సోపానమార్గంబునన్. ౩౯

సీ॥ గాత్రోల్లసద్ఘనాఘనదీప్తిఁ గాంచి బ
ర్హిసమూహముల్ పరుఁ గెత్తి యాడఁ;

జరఠారుణాక్రాంతసోపానవిధుశిలల్
పద్మరాగాయితప్రభల నెసఁగ,
నకలంకముఖసరోజారాతి నీక్షించి
మునిచకోరాళి సమ్మోద మందఁ,
దతవితంబావృతోత్కటపీతకౌశేయ
కనకాభ మొగ మెల్లఁ గప్పుకొనఁగ,

తే॥గీ॥ గండ, భేరుండ, వేదండ, పుండరీక
కాండసంచారవిలస దాఖండలాతి
చండదోర్దండమండితోద్దండభిదుర
ఖండితోదగ్రసానువుల్ గాంచి చనుచు. ౮౦

సీ॥ భీకరాదభ్రదర్వీకరోజ్జ్వలఫణా
మణిగణదీపికల్ మంచుచోట,
భిల్లసాధ్వీహస్తభల్లనిర్భిన్నమ
స్కరగళన్ముక్తాళి గల్గుచోటఁ;
జంద్రాతపక్రాంతచంద్రోపలస్రవ
జ్ఝరవారితుంపురుల్ దొరఁగుచోట;
మల్లికాతల్లజోత్ఫుల్లసూనవితాన
వరమరందరసంబు గురియుచోటఁ;

తే॥గీ॥ గీరపికశారికోదారవారహారి
భూరిసారంగనికరఝంకారసార
చారువిస్తారగానముల్ మీఱుచోట;
నొక్కగుహ గాంచె శౌరి మహోన్నతముగ. ౮౧

ఉ॥ ఆమహనీయదివ్యగుహ యంబుజమిత్రశశాంకపావకో
ద్దామమరీచులున్ జొరక దైవశిఖామణివాసమే కదా!
యామహనీయదివ్యగుహ యట్టులె మిత్రశశాంకపావకో
ద్దామమరీచులన్ జొరక దైవశిఖామణివాసయోగ్య మా, ౪౨

కం॥ ఆఘనతరగిరిగుహలో
మేఘాంచితదివ్యగాత్ర మేచకరుచి,భ
క్తాఘౌఘప్రధ్వంసుఁ, డ
మోఘుస్స్వర్ణాంబరుండు ముదమునఁ జొచ్చెన్. ౪౩

వ॥ ఆసమయంబున ౪౪

కం॥ అజముల మేఁపుచు నిద్దరు
వ్రజతిలకులు హరినిఁ జూచి వసుధారమణీ
ద్రజనీకరుతోఁ దెలుపన్.
నిజశక్తిన్ వారు సనిరి నిజపురమునకున్. ౪౫

కం॥ అని శంభుఁడు సెప్పిన విని
మునివరుఁ డి ట్లనియె "దేవ! మురరిపుఁడు రమా
వనితను వైకుంఠంబున
ననిచిన నాదేవి యెంటి నుండెనొ? చెపుమా!". ౪౬

వ॥ అనిన శంభుం డి ట్లనియె. ౪౭

చ॥ తనపయి లేనిపోని దొకతప్పు ఘటించి ఖగాధిరాజవా
హనుఁడు మహోగ్రకోపమున హా! యెట కేగెనొ? యంచు నిందిరా
వనజదళాక్షి దర్పకనవప్రదరాఽళికిఁ జిక్కి సొక్కఁగా
ఘననిభవేణి వేత్రధరకాంత మొదల్గలచాన లత్తఱిన్. ౪౮

క॥ అమ్మా! నీ విటు లల్కిలు
గ్రమ్మంగ మా కడ వేమి కారణమో? మా
యమ్మా! నిను బ్రతిమాలెద
మమ్మా! మా కోడఁ దెల్పు మమ్మా! మాయమ్మా!. ౫౯

మ॥ అనుచున్ సూత్రవతీసఖీజనసమూహ మ్మయ్యంభోజనేత్రాశ్రుగౌ
చననేత్రాంతరనిర్గతాశ్రుకణముల్ సంవ్యాసచే నంచలం
బునఁ బో నొత్తి "యి దేల? యమ్మ! యిటులన్ బాఁధింతు! వింతింపఁగాఁ
గనునే? శౌరియు లేఁ; డతండు నను నేడక్కునె? దగన్ దెల్పుమా!" ౬౦

వ॥ అనిన రమాదేవి యిట్లనియె. ౬౧

సీ॥ వినరమ్మ! చెలులారా! వనజనాభుని తోడ
మనవిగా నే నన్న మాట వినుఁడు,
మనుజు లెల్లరు మందమతులు దుష్కర్ములు
పుణ్యహీనులు నల్పబుద్ధియుతులు,
దురభిమానులు పరదూషణాతత్పరు
లనృతవాదులు కుత్సితాలోచనులును,
పరధనాఽసక్తులు గురుభక్తిరహితులు
శరణాసురాహితకరులు నైన

తే॥ గీ॥ వీర లేరీతి నీపాదసారసముల
సన్నిధికిఁ జేరఁగా వచ్చు? సరసిజాక్ష!
పతితపావనకీర్తి నీపట్లఁ గలదు
వంచనము లేక వారి రక్షించు మనఘ!. ౬౨

మ॥ అని నేఁ బల్కినయంతలోన హరి తా నత్యంతకోపంబునన్
"వనితా! దుర్భరపాపకర్మరతజనవ్రాతంబులన్ బ్రోవ లే"
దని, నన్ "యుష్మదనర్ఘ్యపావనయశం బక్షాంత మెట్లుండునో!
యనుచున్ హేళనమాట లాడెదవు నీ కర్మంబె"యంచున్ జనెన్. ౫౩

ఉ॥ అప్పటినుండి స్వామినను సందలియూరట మేమి సెప్ప నో
యప్ప! యి దేమిచిత్రము పికాఽళిశుకాఽళిమరాళికూఁత నా
కెప్పటియట్ల వీనులకు నింపు ఘటింపదు; శూలజాలముల్
గప్పిన గుప్పినట్లు యగుఁ; గాలవిపర్యయ! మేమి సేయుదున్. ౫౪

మ॥ సఖియా! శ్రీనిఁ బాసి యిందు నిలువన్ శక్యంబు గా దమ్మ! యా
నిఖిలాఽశాంతవిహారిదేశములఁ దానే యున్న వాఁ; డైన నా
మఖవిద్వేషిపిలించి దేవపతిసన్మౌనీంద్రసంఘంబు ల
య్యఖిలాధ్యక్షుఁ గనంగ లేచి చని, నేనా! చూచుటల్ మానినే!. ౫౫

శా॥ ఆలావణ్యము నాతనూవిలసనం బాసుందరాఽకార మా
లాలిత్యంబును నామనోజ్ఞతయు నాసౌలభ్యసంభాభూతి యా
హేలాప్రౌఢిమ యావిభవ మాహృద్యప్రభావంబు నో
బాలారత్నములార! చూడక తరంబా! నిల్వఁగా నిచ్చటన్. ౫౬

తే॥ గీ॥ వినఁ జెలులార! ధరణిలో సరసి చూత
మనుచు దగ్గున లేచి కన్యాఽంతరములు
గడచి తడఁబడునడుపుల జడధికన్య
నెడలెఁ దననెంటఁ బడఁతులు నడచి రాఁగ. ౫౭

శా॥ గంధేభేంద్రనమానయాన చనుచోఁ గాంతారమార్గంబులన్
గంధోత్తుంగలవంగలుంగకదళీఖర్జూరమాకందన

ద్బంధూకాదికుజాతజాతముల నిస్తంద్రోగ్రహార్యప్రముల్
గంధర్వాణతరక్షుపోత్రిచయముల్ గన్పించఁగా సత్త్రశ్రీన్. ౯౮

సీ॥ సారంగవరదునిజాడఁ దెల్పుఁ డటంచు,
సారంగములచెంతఁ జేరఁ బోవుఁ;
బున్నాగశయనుఁ డెం దున్నాఁడు? చెప్పుఁ డంచుఁ,
బున్నాగగణములపొంత కేఁగుఁ;
బుంసింహరూపునిపోలుపుఁ జూపుఁ డటంచుఁ,
బుంసింహముల డాసి పోగడఁ జనును;
సౌకర్యవేషుఁడు చనినచో ప్పెది యంచు,
సౌకర్యనివహంబుచక్కి కరుగు;

తే॥ గీ॥ శంబరద్వేషిజనకుఁ డేసదనమందుఁ
గలుగు నని శంబరాహీంద్రావళినిఁ బలుకు;
మేర లేనట్టివెతలచే సారసాక్షి
పృథులమృగముల నడుగును బెదరి చనఁగ. ౯౯

సీ॥ ఘనసారతరులార! చూచినఁ జెప్పరే!
ఘనసారరుచిదేహకాంతివాని,
సురసాలతరులార! కనుఁగొన్నఁ జెప్పరే!
సురసాలసుమదామగరిమవానిఁ,
గాంచనతరులార! కాంచినఁ జెప్పరే!
కాంచనాంశుకసజ్జఘనమువానిఁ;
బున్నాగతరులార! పొడఁగన్నఁ జెప్పరే!
బున్నాగనగదుఁ డై యున్నవానిఁ;

తే॥ గీ॥ సుందరతరాకార! చెప్పరే! కుందరదనఁ
డెందుఁ బోయెనో? యంచు రాకేందువదన
మందగతితోడఁ గాంతారమందు వెదకి
యెందుఁ గానక మదిఁ జింత నొంది యుండె. ౬౦

గ్రీష్మర్తు వర్ణనము.

కం॥ ఆసమయంబున గ్రీష్మం
బాసన్నం బైన జనుల కతిభీకర మై
వేసట నొసరించుచు భువి
భాసురభీష్మాతపంబు ప్రాప్తం బయ్యెన్. ౬౧

సీ॥ అగ్న్యమగార్హపత్యాగ్నిహోత్రాహుతి,
మార్గమస్తకశైలదుర్గమపవి,
శర్వరీయామమహాసనిశాతదాత్రంబు,
బధిరీకృతానేకపథికచయము,
దవగంధవహసుహృజ్జనసమృద్ధమనిక,
సంక్షోభితాఖిలజ్యాతలంబు,
శోషితాశేషసదోషధివ్రాతంబు,
కాసారజీవనగ్రాసవిహృతి,
తే॥ గీ॥ స్త్రైసమానాభిసంవృద్ధిదాసకరము,
ఘర్మసలిలోద్భవాస్తోకకారణంబు,
సకలజనతాపకరము నై జగతియందు
భీష్మరూపక మగుచు నాగ్రీష్మ మలరె. ౬౨

శా॥ ఆవేళన్ సరసీరుహాఽలయ సఖీశ్యామాఽఽళి వెన్వెంట రా
దేవోత్తంసశిఖామణిన్ వెదకుచోఁ ద్విధాఽమరుగ్వ్యాప్తిచేఁ
దో్రివన్ బోవఁగ లేక యొక్కలలి తేందుగ్రావవేదీస్థలిన్
భావోద్భూతవిషాదవేదనల నీపచ్ఛాయ నున్నంతటన్. ౬౩

## వర్షర్తు వర్ణనము

కం॥ కర్షకజనహర్షక మై
వర్షాకాలంబు వచ్చె వన్యాహ్లాదో
త్కర్షంబుగఁ జాతకఖగ
తర్షంబుగ సకలజంతుతాపం బారన్. ౬౪

సీ॥ మహనీయగర్జలు మర్దళధ్వనులుగా,
దర్దురాఽరావముల్ తాళములుగఁ,
జంచరీకధ్వనుల్ సరసరాగములుగాఁ,
బటుఝిల్లిరవము లుపాంగములుగఁ,
గలితశంపాలతల్ కరదీపికలు గాఁగ,
భవ్యమేఘములు నేపథ్యములుగఁ,
గంకణధ్వానముల్ కంకణధ్వనులుగా,
క్ష్మారుహంబులు చూచుజనులుగాఁగఁ,

తే॥ గీ॥ బ్రావృడాగమనర్తకప్రాజ్ఞుఁ డొకఁడు
ధరణిభృన్మౌళిరాజసంస్థానమందు
బర్హిణీవేశకాంతల నర్హ మైన
నాట్య మొనరింపఁ జేసె నానందముగను. ౬౫

సీ॥ అది కేశవునిగాత్రమా! కాదు, ఘనఘనా
ఘననీలబంధురకాంతి గాని;
అది విష్ణుకరశార్ఙ్గమా! కాదు, దేవరా
డ్దివ్యకార్ముకలసద్దీప్తి గాని;
అది మాధవాంబరంబా! కాదు, రమణీయ
తరభాసురైరమ్మదంబు గాని;
అది శౌరివాగ్రవంబా! కాదు, సుమహిత
గంభీరజలధరగర్జ గాని,

తే॥ గీ॥ యెంత భ్రమసితి నిపుడు నే స్వాంతమందుఁ
గాంతుఁ డేమొ యటంచు నో కాంతలార!
కంతుఁ డొనరించుమాయ లీకాంతు లనుచుఁ
జింత సేయుచు నిందిరాకాంత సనఁగ. ౬౬

శరదృతు వర్ణనము

కం॥ శరదాగమ మేతెంచెను
సరసీరుహషండతపము సఫలతఁ జెందఁగ,
బరమేష్ఠ్యశ్వము లలరఁగ
హరిణాంకగభస్తినివహ మతిధవళము గాఁగ. ౬౭

సీ॥ బిడ్డ గావున నబ్ధి ప్రేమతో లక్ష్మికిఁ
బంపినముత్యాలజంపు లనఁగఁ;
దల్లి కాల్నడఁ బోవఁ దగ దంచు విధి పంప

దొరసాని యడవులఁ దిరుగఁగాఁ గని యింద్రుఁ
డడుగులఁ బరిపించుమడుగు లనఁగ;
గగనభారతి రమాకాంతకు నీడగా
నిడినట్టివెలిపట్టుగొడుగు లనఁగ,
తే॥ గీ॥ నబ్ధిజాతకు నమృతాశనాబ్జపాణు
లంబరంబున నిలుచుండి యలర వీచు
చామరంబులో! యన నొప్పె శారదాగ
మాచ్ఛధారాధరావళి యరుదు గాఁగ. ౬౮

కం॥ ఆశరదాగమవేళల
నాశరహరు వెదకి యలసి యజ్ఞాకర మం
దాశరజశయ కని వయ
స్యాశరజాననలు గొలువ నచ్చట నిలిచెన్. ౬౯

చ॥ వరశరదాగమం బనెడివైరినృపాలునిరాజ్యభోగ మే
సరవడి నాక్రమింతు నని యుగ్రహిమాగమరాజమూళి దా
నరుదుగ హైమబైందవశరాళి వెసన్ దొరఁగించి వేగమే
తరిమినఁ బోయెనో! యనువిధంబున శారదకాల మేగెన్. ౭౦

హేమంత వర్ణనము.

కం॥ అంతట హేమంతము బల
వంతం బై ముక్తకాంతవనితాపిలస
త్స్వాంతాంతరరోషాంచ
ద్ధ్వాంతత్విడ్ధామకాంతి పైఖరి మించెన్. ౭౧

తే॥ గీ॥ అద్దినంబునందు నర్యముం డతివేగఁ
జరమధరణీధరముచాటు కేగు,
నగ్ని వృద్ధజనులయందుఁ గుంపట్లలో
నణఁగెఁ జలికి వెఱచి యనఁగ నొప్పె. ౭౨

ఉ॥ ఆసమయంబునందు శిశిరాఽగమ మైన, రమావధూటి త
ద్వ్యాసముఁ బాసి కేశవుఁడు వచ్చినజాడనె వచ్చి వచ్చి త
న్మాసయుగాంతవేళ నసమాననఖీకువలాధిరాణ్ముఖుల్
వేసట లేక తోడఁ జన వేగమె యంజనశైల మంతటన్. 23

మ॥ కని చేరం జని యందు ముందు ఘననక్రిధ్వంసుఁ డున్నట్టియా
వనజాతాఽకర మారమారమణి చెల్వం బొప్పఁగాఁ జూచి యీ
వనసౌరభ్యము లీవనప్రియశుకవ్రాతంబు లిం పొందఁగాఁ
గనిపించెన్ మన మిందే యుందమని సంకల్పించి యున్నంతటన్. ౭౪

సీ॥ నటదర్జునాపాంగపటుపింఛపింఛోళి
జాతవాతాఽహారసర్పచయము;
స్తంబేరమస్తనంధయగండకండూతి
హారణనఖాగ్రిగార్యక్షగణము;
సారంగశాబకసముదాయ సంబన
దుర్భరోదగ్రిశార్దూలవితతి;
చాంపేయసుమరసాఽస్వాదనాఽహ్లాదైక
తుందిలపుష్పలిడ్బృందములును,

తే॥ గీ॥ గోచరం బైన నిందిరాకువలయాక్షి
చూచి యిది యేమిచిత్రమో! సుదతులార!

భాసురం బైనయీమహాపర్వతమున
నీరజాక్షుండు గలఁ డంచు నిశ్చయించె. ౨౦

## వసంత వర్ణనము.

చ॥ అలరె వసంత మంతట లతాంతశిలీముఖకుంతజాలకో
త్కలితవనాంతకాంతపరికల్పితకుంజనిశాంతకాముకీ
లలితరతాంతఘర్మసలిలప్రజసంతతవారణోజ్జ్వల
న్మలయసమీరకీరపికమాధుకరాదివిహారహృద్య మై. ౨౧

చ॥ పెనిమిటి వచ్చె నంచు మురిపెంబు మనంబున సందడింపఁగా
వనవనజాక్షి శోణమణివజ్రవిభూషణభూషితాంగి యై
తనరె నటన్న చందమున ధారుణి యుద్భిజ మొప్పె నెల్లెడన్
వినుతసుమాకరాగమనవేళఁ గిసప్రసవాభిరామ మై. ౨౨

వ॥ మఱియు నవ్వసంతంబు వేదాంతంబురీతి శుకముఖవిప్రయోగానందం
బై, వైకుంఠంబువిధంబున మధుసూదనహృదయాభిరామం బై, కైలా
సంబుచెలువునఁ గాలకంఠవిహారోద్భాసితం బై, త్రిదివంబుభాతి సుమ
నోవితానమహోల్లాసకరం బై, సూర్యమండలంబుఠీవి ఛాయాసమన్వి
తం బై, పరిపూర్ణరాకానిశీథినిచందంబున ద్విజరాజవిరాజమానం బై,
దేవతాసమూహంబుచాడ్పున సరసామృతాహారం బై, దుర్మార్గ
రాజప్రపంచంబువోలె సుజాతికుజాతితిరస్కారాహ్లాదకరం బై
వేశ్యాజనమందిరంబుతేవను బల్లవతల్లజసల్లలితం బై, గ్రీష్మర్తుకరం
మిథునసంక్రాంతివిభాసురం బై, ప్రావృడాగమంబుతీరునఁ బుష్కర
సమృద్ధం బై, శరత్కాలంబుపోలిక శుక్లపక్షాధీశ్వరకళామోద
కారణం బై, హేమంతంబులీల సమాలింగితతనువల్లీజాలం బై, శైశి

సమయంబుపొంకంబున సమశీతోష్ణకలితస్త్రైణస్తనాంతరోద్భాసితం బై ప్రకాశించె; నాసమయంబున మారవికారశాంతిస్వాంతయై యున్న యిందిరాదేవిముఖారవిందం బవలోకించి సూత్రవతీవయస్యారత్నం బి ట్లనియె. ౨౮

సీ॥ సుమనోవితానంబు శోభాగరిమఁ గాంచె,
ధరణిజాతచయంబు దనరుచుండె;
నవనఫలప్రాప్తి సద్ద్విజాళికిఁ గల్గె;
శుకభరద్వాజప్రచురము నయ్యె;
మిత్రవిభూతి సమృద్ధ మై చెలువొందెఁ;
బ్రద్యుమ్నకాండసంపత్తి గల్గె;
సురభి యేప్రొద్దు సంశోభితం బై యొప్పెఁ;
బ్రతిదినసంపత్తి బహుళ మయ్యెఁ;

తే॥ గీ॥ బరఁగ భూమి పరాగబంధురము నయ్యె,
వింత గద! యమ్మ! యిదియంత దంతిగమన!
మాధవాగమనవిశేషమహిమరీతి
మాధవాగమనవిశేషమహిమ దనరె. ౨౯

మ॥ అనిన న్సూత్రవతీముఖాంబుజము నయ్యంభోరుహావాస గ
న్గొని యూహూ! యిప్పు డిందు నీ వెటులఁ గన్గొన్నావొ కానీ! సఖీ!
వినవే! వీఁడు సజాతివైరి భవవిద్వేష్యస్త్రనిర్మాతయై
ఘనపాంథప్రకరప్రఘాతి తగ నే గర్వాఢ్యుతు న్వర్ణింపఁగన్?. ౩౦

చ॥ విధుముఖి! యేమి చెప్ప? నరవిందదళాయతనేత్రుఁ డిమ్మహిన్
మధుని వధించినాఁ డనినమాట ది మిథ్య; నిజంబ యేని, నీ

మధుఁ డెటనుండి వచ్చె? బహుమాయలు కల్పన సేసి నన్ను మ
న్మథువెత కప్పగించి చనె మాధవుఁ డక్కటా! యేమి సేయుదున్. ౮౧

## మన్మథ దూషణము.

కం॥ అదె విను చెలియా! మదనుం
డదయుం డై వచ్చె నేమొ! యహహా! యిదె నా
యెద యదరఁగఁ జెలఁగెన్ ద
న్మదయుతబలనికరసింహనాదాఽర్భటులన్. ౮౨

సీ॥ కోప మెప్పుడు ముక్కుకొన నుండు ఘోటక
మెక్కి స్వబలముకం డ్లెత్తి సేయుఁ;
గమధర్మ మేమన? గంట్లమారినిఁ బూని
గుఱు తైనమధుపాయిగుణముచేత
విషజాతబాణముల్ వెస సేయఁ దొడఁగెను;
దోడు మామను గురుద్రోహిఁ గూడి;
యాశ్రయాశసఖుండు నదుగో! చూడఁగ వచ్చె;
మీరు సూడరె! మంటమారి మారు;

తే॥ గీ॥ సేద కెట్లోర్తు సాంకవాఽమోదగాత్రి!
రామ! గజయాన! కాంచనధామ! హంస
గతి! విధుంతుదరోమాఽళి! కాలభుజగ
వేణి! హరు నైనఁ గొలువరే! వెలఁదులార! ౮౩

ఉ॥ భామిని! యే మనంబు? ననపాయిని యంచు నొకప్పు డైన ము
న్నే మరకే భుజాంతరమహేంద్రశిలాఽఽయతపీఠమందు నన్

దామరసాక్షుఁ డంకమువిధంబునఁ జేరిచి; నిర్దయాఽత్ముఁ డై
కామశరాగ్నిలో నిపుడు గ్రిక్కున వైచె నటంచు నర్తుటిన్. ౮౪

మ॥ సరసీజారిశిలాతలంబున రమాసాధ్వీలలామంబు దాఁ
దరుణాంభోరుహతల్పమం దమితసౌందర్యాంగమున్ జేర్చి శ్రీ
హరి కే నెంతటిభార మైతినొ! సఖీ! హా! యంచుఁ బల్కెన్ వడిన్
స్మరపుండేక్షుమహోగ్రకార్ముకకనజ్జ్యాజాతనాదాఽర్భటిన్. ౮౫

మ॥ తల యూచున్; నగుఁ; గన్ను మూయుఁ; దెఱచున్; దబ్బిబ్బు మాటాడు;
మే నలయన్ సోలు; బిరాన లేచు; జలదశ్యామాభిరామాంగునిన్
దలఁచున్; జెక్కిటఁ జేయి సేర్చు; మది సంతాపంబు రెట్టింపఁ గ
న్నుల నీరున్ దొరఁగించుచున్ విగతసంతోషంబుతో నుండినన్. ౮౬

## సాయంకాల వర్ణనము.

చ॥ అపు డహిమాంశుఁ డస్తగిరి నందెఁ బయోనిధిరాజకన్యకా
చపలమృగాక్షి మన్మథనిశాతశరాగ్నికిఁ దాళఁ జాల క
ట్లుపగతమోద యై పొరలునారట మంతయుఁ జూడ లేక తా
నపరదిశానగేంద్రమున కావలి దిక్కున కేగునో! యనన్. ౮౭

సీ॥ చరమసర్వంసహాధరశిఖాఽగ్రంబునఁ
బుష్పితకింశుకభూజ మనఁగ;
నపరదిగబ్జాతలపనాకటీతటో
ద్భాసురకౌసుంభపట మనంగ,
నమరేంద్రిమర్దితచటులనభోదైత్య
తనునిర్గళదసృగ్ధార లనఁగ,

సూనబాణరణప్రయాణ వేళారతి
కిరదక్షతారుణఘృణు లసంగఁ,

తే॥ గీ॥ గాలదుర్భరమత్తశుండాలశుంభ
దమితకుంభస్థలాంతరవిమలఘుసృణ
మసృణరమణీయదీధితిమహిమ యనఁగ
సాంధ్యరాగంబు దనరె నిస్తంద్రగరిమ. ౮౮

చ॥ పసుపుకృపీటభృచ్ఛబరి సాంఖ్యమహోజ్జ్వలరాగవహ్నిపై
నమరఁగఁ బేలగింజ లపు డాకస మర్ఘ బెనుమంగలంబునన్
బ్రిమద మెసంగ వేఁచిన నపారముగా నవి చిక్కెనో! యనన్
గ్రమమునఁ జీఁకటుల్ బెరసి గ్రక్కునఁ జుక్కలు మొల్చె నెల్లడన్. ౮౯

సీ॥ సురపథోదగ్రవిస్ఫురదమృతాశన
క్షోణిరుట్ఛాఖాగ్రసూన మనఁగఁ,
ప్రాచీదిశాంగనాభాసురహస్తాబ్జ
కలితమౌక్తికకందుకం బనంగఁ,
గీరనాసీరార్వధారుణీశోత్క్షిప్త
భాసుర శ్వేతాతపత్ర మనఁగ,
తుణదార్యమకుమారికామత్స్యవోదగ్ర
మండితడిండీరఖండ మనఁగఁ,

తే॥ గీ॥ బాండురద్యుతినిర్జితకుండలీంద్ర
కాండజోద్భవకాండేంద్రతుండికాండ
పుండరీకాండజాధీశతుండచంద్ర
మండలం బొప్పెఁ దూరుపుకొండమీఁద. ౯౦

ఉ॥ దారచయంబులో మిగులఁ దామసి యామిని యంచుఁ గోపి నై
సారసశాత్రవుండు కరజాలములన్ వడి సాచి త్రోఁచినన్
దీఱనిసిగ్గుతోడ జగతీజముఛాయల డాఁగెనో! యనన్
ధారుణి వెన్నెలల్ నిగిడి దవ్వుల నీడలు సాఁగె నంతటన్. ౯౧

చ॥ కదళిసుమచ్ఛదాచ్ఛచషకంబుల నిండిపకౌముదీసురన్
ముద మొదవంగఁ గ్రోలి పరపూర్తినిఁ జెంది చకోరదంపతుల్
మదమున నుల్లసిల్లి సుమమార్గణయుద్ధసముద్ధతంబు లై
యెద లెద లంటఁగా నదిమి యింపు జనింప సుఖింపుచుండుదోన్. ౯౨

సీ॥ తగనితాపముఁ బెంచుతొగఱేని నిందించు;
నిందించి కన్నుల నీరు నించుఁ;
జలచంచుసంచయ మలరించు తెలివెన్నె
లలు గాంచుఁ; గాంచి తా నలమలించుఁ;
దను ముంచుకొనుమోహమున మించువలిమంచు
గనిపించుఁ; గనిపించినను గృశించుఁ;
బతి యంచుఁ దననీడఁ బరికించుఁ; బరికించి
కా దంచు విరహాగ్నిఁ గలవరించు,

తే॥ గీ॥ నించువిల్తుఁడు కోపించి పంచశరము
లెంచి పొంచుచుఁ దనమేన నించె నంచుఁ
బలువరించు; నయో! యంచుఁ బరితపించుఁ;
గాంతునిఁ దొలంగి యొక్కజక్కవలతాఁటింగి. ౯౩

మ॥ తొగఱేఁ డన్ఘుపమాంత్రికుండు తుహినస్తోమామితద్రప్సముల్
జగతిన్ రాలఁ జకోరవారరుతి విస్తారోగ్రమంత్రావళిచే

జగదావేశనిశాపిశాచనికరోచ్చాటక్రియాధుర్యఁ జై
తగఁ బైపై కెగ నూఁదుభస్మ మన నంతన్ జ్యోత్స్న వ్యాపించినన్. ౯౪

క॥ ఆవెన్నెలలో నిందిర
భావజసంతాపతప్తభావము గల దై
జీవనజాతారినిఁ గని
జీవంజీవారి యనుచుఁ జెలితో ననినన్ ౯౫

తే॥ గీ॥ వేత్రధరకాంత విని హారిత్వ్రతితురగ
పత్రచయబాధ కీశతపత్రపత్ర
నేత్ర కువలయమిత్రుని మిత్రుఁ డనుచుఁ
జిత్రముగఁ బల్కె నీకి నేమి సేతు? ననుచు. ౯౬

క॥ చూ డమ్మా! యీతఁడు నీ
తోడను జనియించినట్టిసహితునిదాఁ డే కా!
పీఁ డేల భాస్కరుం డగు;
నీడజనైం నవుకొమ్మ! నీతో డమ్మా! ౯౭

చంద్రదూషణము

మ॥ అనినన్ జూపుల చంద్రుపై నిలిపి తా నత్యంతకోపంబునన్
విన రా! యో! కళంకి! శంకరుఁడు నీవృత్తంబు విస్పష్ట మా
టను నిస్పష్టము సేసి యోటు గలనీటన్ ద్రోచె; నేఁ డెట్టు లీ
ఘనమార్గంబున మించినాఁడవో? విరహాగ్రాప్తికే మం చనన్, ౯౮

౦॥ ఓరాకారజనీచర!
నీరాకకు జాలు గరఁగి నీ రాఁ గద! నే

నేరీతి నోర్వ వచ్చును?
మే లౌ రా? యనుజ నేఁచ మిత్రద్రోహీ! ౯౯

కం॥ అంకముగా మునుపే యొక
రం కుండఁగ గురునిసతిని రమియించినబల్
రం కొక్కటి గలిగెను; నీ
కింకా రం కేల సతుల నేఁచఁ గళంకీ! ౧౦౦.

చ॥ జగతిఁ గలట్టిపద్మినులసంపదఁ జూఱలు పుచ్చుదొంగ వం
చుఁ గద! యినుండు నీఘనవసుప్రకరంబు హరించి యుగ్రుఁడై
పగలఁ గలంపఁ బూని నిను బట్టెద నం చని వెంట నంటఁగా
నగపడ కభ్రవీధి నిశలందుఁ జరించెద వౌర! చంద్రమా! ౧౦౧

మన్మథ దూషణము.

కం॥ అంతట నిల్వక పటుతర
చింతాసంతాపతప్తచిత్తము గలదై
కంతుని నుద్దేశించి దు
రంతామర్షంబుతోడ రమ యి ట్లనియెన్. ౧౦౨

కం॥ ఓరీ! మారా! యేరా!
మేరా? యీరీతి నేఁచ; [illegible] మేలుమా? [illegible]
గారాబ మాఱు; తల్లికి
నేరం బొనరించువారు నీ [illegible] పోరా? ౧౦౩

సీ॥ మహితాత్మకర్మగుణంబు మలినత్వమును జెందెఁ;
బటుతరాశ్వము చవల్ పట్టి పోయె;

మే లైన బాణముల్ మేదినిపైఁ బ్రాలె;
నంద మా స్యందనం బగ్నిఁ గలిసె;
ఘనుఁ డైన చెలికాఁడు కాంతారములఁ దూఱె;
మేనమా మగువాఁడు మింటఁ గలిసె;
నధిక మా కేతనం బబ్ధినీటను గూలె;
బలము తల్లిని. దండ్రిఁ బాసి చనియె;

తే॥ గీ॥ భర్గదృగ్జాతదుర్గమానర్గళాగ్ని
నిర్గతాత్యుగ్ర కీలాప్రవర్గములను
గూలి యేరీతి బ్రతికితో? మేలు మేలు!
విమలసుమచాప! విస్ఫుటకమలరూప! ౧౦౮

సీ॥ ఒకటి రెం డొసరించు యోధు లుందురు గాని,
రెం డొండు సేయుకోదండి గలఁడె!
క్రూరనారాచభృచ్ఛూరు లుందురు గాని,
వారిజనారాచధారి గలఁడె!
దృఢ వాహినీపరివృఢులు నుందురు గాని,
పరభృతభటచయప్రభువు గలఁడె!
విలసితావయవసంకలితు లుందురు గాని,
ఘనతరాంగవిహీనజన్ముఁడు గలఁడె!

తే॥ గీ॥ యిట్లు వింతలు పెక్కు నీపట్లఁ గల్గె;
ధర వియోగుల నేఁచెడిధర్మశాలి?
భళిర! విపరీతశౌర్యసంకలితధీర!
శుకకులాధ్యక్షకంఖాణ! సూనబాణ! ౧౦౯

చ॥ హరనిటలాంబకోదితమహాద్భుతకీలికరాళకీలలన్
దొరలి శరీరమున్ విడిచి తొయ్యలులన్ మిడికించ భూతమై
తిరిగి 'యనంగ' నామమునఁ దేజము నొందితి; వే మనందు నిన్,
గరితల నేఁచ హేతువు దగన్ రతిమంగళసూత్రశక్తి యా. ౧౦౬

చ॥ అనిలునిఁ బ్రాణ మైనహితుఁ డంచు మనంబున నమ్మినావు గా!
నిను బొలియించునాఁడు హరనేత్రకృశానుకరాళకీలకున్
బనివడి తోడు వోయి నిను భస్మము సేసినపాపకర్ము నే
యనువున నమ్మినావొ? వనజాంబక! నీ కది యెట్లు సహ్యమో! ౧౦౭

సీ॥ వీఁడె కా! నీమహాబాడబేద్ధాసంబు
తోడిఁబడఁ బుడమిలో నడఁగఁ జేసె;
వీఁడె కా! నీశాతవిశిఖసందోహంబుఁ
జెలరేఁగి మంటిలోఁ గలిపి వేసె;
వీఁడె కా! నిను నూర్జన్వృషభధ్వజునికంటి
మంటతో దై నిన్ను మడియఁ జేసె;
వీఁడె కా! నిఖిలామనూనమున కాహార
భూతుఁ డై యతనిని బొలియఁ జూచె;

తే॥ గీ॥ వీఁడు హితశాత్రవుఁడు నీకు వీని నమ్మి
యున్న దెల్లను గ్రూరు లొపన్నగముల
నోటిఫలములఁ గాశించుపాటి యగును;
దెలిసి వర్తించు మిఁక నైన జలజబాణ! ౧౦౮

చ॥ చెలఁగి హయంబు కార్ముకముఁ జీల్చె; భటాళి కృపాణజాలముల్
గళగళ ద్రుంచె; మార్చి విశిఖవ్రజసారముఁ దీల్చె, మామ నిన్

బొలియఁగఁ జేయువైరితలపు వ్వాయి మించె, వినిర్గతాంగ! యే
చెలువునఁ గూర్చికొంటివొ! విశేషముగా గృహకృత్యవైరులన్. ౧౦౯

తే॥ గీ॥ అంతలో సూత్రవతి సూచి కాంత! యింత
రంతు సేయంగఁ దగునఁటే! కాంతలకును;
జింత సేయకు; వచ్చు నీకాంతుఁ డనిన;
మారు దూఱక వేసారి యూర కుండె. ౧౧౦

ఆశ్వాసాంతము.

కం॥ అరుణాంతర్గతశరణా!
శరణాఽగతభక్తజాతసాక్షాత్కరణా!
కరుణాలసదాచరణా!
చరణాబ్జవిలక్షణైకసదమలచరణా! ౧౧౧

భుజంగప్రయాతము.

బలద్విడ్విరోధిస్ఫురత్ప్రాసధీరా!
దళద్రుద్రకోదండదైర్ఘ్యప్రచారా!
చలన్నీరదానర్ఘ్యచంచచ్ఛరీరా!
శిలాకామినీకృద్విశేషావతారా! ౧౧౨

ఇది శ్రీరామచంద్రపదారవిందమరందరసాఽస్వాదనతుందిలేందిందిరాఽయమానాసమానతూముమంశక్షీరపారావారరాకాసుధాకరరామకృష్ణమాపాలసుపుత్రపవిత్రచరిత్రాక్షీణాంధ్రగీర్వాణచణరామచంద్రావనీపాలవిరచితశ్రీమదలమేలుమంగాపరిణయం బనుమహాప్రబంధంబునందు
ద్వితీయాఽశ్వాసము

## తృతీయాఽశ్వాసము.

కం॥ శ్రీమద్భూమిసుతాఽఽముఖ
సోమాఽప్తాఽనంది నేత్రసుధ గచకోరా!
భీమోద్ధతభృగుకులభవ
రామామితమదవిరామ! రఘుకులరామా! ౧

తే॥ గీ॥ అవధరింపుము శంకరుం డవ్వలికథ
నారదున కేమి సెప్పె విస్తారముగను,
దాని వివరింపవే! యని శౌనకర్షి
యడిగినఁ సూతుఁ డతనితో ననియె నిట్లు. ౨

ఉ॥ తూరుపుఁదెల్పు మించె; భువిఁ దోయజముల్ వికసించెఁ; బువ్వులి
ద్వారము ఝుంకరించె; ఖగవర్గమహాఽర్భటి మించెఁ; గమ్మనౌ
మారుత మేగుదెంచె; విలు మన్మథుఁ డెక్కు డలించెఁ; గైరవ
శ్రీరమ మోము వాంచెను; నశించె నిశారమ వేఁగుజామునన్. ౩

మ॥ మొకమోటైనను లేక పద్మినుల నిర్మోహంబుచే నేఁచుటల్
ప్రకటంబైన నినుండు వచ్చె నదుగో ప్రాగద్రిపైఁ జూడు మో
యి! కలంకీ! యిఁక వేగమే జరుగు సుమీ్మ! యన్న చందంబునన్
గృకవాకుప్రకరంబు వేశ్మములచక్కిన్ నిల్చి కొక్కోఁ! యనెన్. ౪

సీ॥ గగనరమాఽధీశఘనభుజాఽర్గళయుగ్మ
కలితోరుశంఖచక్రంబు లనఁగ,

సమయమత్తేభేంద్రసదమ్మోభయపార్శ్వ
కలధౌతకాంచనఘంటలనఁగ,
జరమపూర్వాధీశవరవధూకరయుక్త
ఘనహీరమణికందుకంబు లనఁగ,
ప్రత్యూషభామినీశ్రవణద్వయోజ్జ్వల
ధవళారుణాంచితోత్పలము లనఁగ,

తే॥ గీ॥ వలరురాకానిశాంతపద్మాక్షిచూళి
కాలికాంతరములయందు సమితముక్తి
కములబొట్టును రాకిణీ యమరెఁ జనఁగఁ
గమలరిపుమిత్రు లొప్పి రకాలమునను. ౫

కం॥ పద్మాయితనేత్రాంచిత
పద్మాసద్మాపకారి పాశ్చాత్యశ్రీం,
ఛద్మకుని ద్రోయ నచ్చునె!
పద్మాప్తుం డనఁగఁ బొడిచెఁ బ్రాగ్గిరియందున్. ౬

కం॥ అనుచున్ శంభుఁడు వల్కెన
ననిమిషముని "విని రమేశు నజపాలుని గ
న్గొని నృపతికి వినిపింపన్
జని" రంటి వదేమి? యనిన శంకరుఁ డనియెన్. ౭

కం॥ మానవతీపురమున బుధ
మానితుఁ డౌతూముకామమనుజాధిపుఁ డా
స్థానమున మహోన్నతపం
చాననపీఠాంతరస్థుఁ డై యున్నయెడన్. ౮

సీ॥ సామంతభూపాలసముదాయ మొకవంక,
నొకవంక రణధీరయోధవరులు,
బహుశాస్త్రవిజ్ఞానపండితు లొకవంక,
నొకవంక సరసగాయకచయంబు,
కార్యదీక్షాఽమాత్యవర్యాళి యొకవంక,
నొకవంక సకళంకసుకవిజనులు,
వారవిలాసినీవారంబు లొకవంక,
నొకవంక మాగధప్రకరములును,

తే॥ గీ॥ నిండుకొలువున నుండ నాఖండలుండు
ధర సుధర్మాఽంతరస్థుఁ డౌకరణిఁ దనరు
తూమురామావనీపాలతోయజారి
కొలువుకూటంబుఁ జొచ్చి రాగొల్లవారు. ౯

కం॥ అరుదెంచినగొల్లలు దా
మిరువురు దండంబు లెట్టి యేలినవాఁ డా
దరమున వెఱఁగునఁ జూడఁగఁ
దలఁచుగఁ గాన్కల నొసంగి ధరణీశ్వరుతోన్. ౧౦

తే॥ గీ॥ సామి! యీయూరియుత్తరభూమి కైన
కూఁతపెట్టునఁ గాటుకకొండ గలదు,
దాన మేఁకల మేఁప మావానితోనఁ
బోయి కంటిని; మనసు కబ్బురము దోసె. ౧౧

కం॥ అన నాముచ్చట యేమో?
వినిపించర! గొల్లవాఁడ! వేగిర మనుచున్

జనవిభుఁడు వల్కినంతనె
తనచేతులు మోడ్చి యెడ్డెతనమున ననియెన్. ౧౨

సీ॥ బొలిబొల్లినామాలు గలమేను గలవాఁడు,
సంకుసక్రాలబుజాల వాఁడు,
తెల్లనిముత్యాలడొల్లుఁబోగులవాఁడు,
ఎదమీఁద నెనఁగుజన్నిదమువాఁడు,
జలతారు వోదిగిసతలకుల్ల గలవాఁడు,
వలిపంపుతగటుదువ్వలువవాఁడు,
రతనాలు దాపనపతకంబు గలవాఁడు,
సక్కనినీలాలసాయవాఁడు,

తే॥ గీ॥ ఎవ్వఁడో కాని మాఁటడు నవ్వుకుంట
కాల్లపాకోల్లు మెట్లపైఁ బెల్లు మనఁగ
నల్లకాటుకకొండన మెల్ల నెక్కి
పెద్దగైలోనఁ జొచ్చె నీపొద్ద రాజ! ౧౩

కం॥ అని జాబాలురు వల్కిన
మనుజాధిపుఁ డాప్తులైనమంత్రులతోడన్
"మనస మేగి చూత మెవ్వఁడో?
ఘనుఁడే కాకున్ననిట్లు గల్గునె? గుప్తుల్. ౧౪

కం॥ మనపూర్వపుణ్యఫల మీ
దినమున ఫలియింపఁ జేయుదేవుఁడు గాఁబో
లును భీకరగిరిగుహలో
జనమాత్రుఁడు సొరఁబడంగ శక్తుం డగునే! ౧౫

తే॥ గీ॥ ఐన మన మేగి చూత మయ్యది నిజంబొ?
లేక మిథ్యయొ? యిది గట్టి గాక యున్న
జనులు నవ్వుదు రింక నిజంబు దెల్పు
డనుచు గొల్లల నడుగుడీ!" యనిన వారు. ౧౬

తే॥ గీ॥ ఉన్న దున్నటు మీ రందు గన్న దెల్ల
గల్ల లాడక తెల్పుడో గొల్లలార!
రాజు సూడగ మీవెంట రా గలండు.
ననుచు నడిగిన నాభీరు డనిరి యిట్లు. ౧౭

తే॥ గీ॥ అబ్బతో డబ్బ! దబ్బఱ లేదు; నిబ్బ
రమున జూస్తిమి; మీ రింక రాండి సూడ;
దర్లపసికెలు మేసెటిగొర్ల నడిమి
కెల్లి వచ్చెను పసుపాస్కవల్లెవాడు. ౧౮

చ॥ అనిన నమాత్యవర్గము నృపాగ్రణితో "నజపాలశేఖరుల్
ఘననిభగాత్రు నిక్కముగ గన్గొనినా" మని పల్కుచున్న వా
రనిమిష రాజభోగసదృశాంచితవైభవ! యెన్నిభంగులన్ మన
మటు వోయి చూడ కనుమానము వాయ దటంచు బల్కగన్. ౧౯

కం॥ ముందర నిలిచిన సేవక
బృందము గని పిల్వ బంపె బృథ్వీశ్వరుడుం
క్రందనుడు గజతురంగ
స్యందనపరివాఢవీరసైనికపతులన్. ౨౦

కం॥ సిద్ధాంతుల గన్గొని పరి
శుద్ధదినం బడుగ 'నిపుడె శుభ' మం చనినన్.

శుద్ధాంతమునకుఁ జని స
న్నద్ధోద్ధతకవచచాపనారాచుం డై. ౨౧

కం॥ జననికి దండం బిడి పని
వినియెద నని జనవిభుండు వేఁడుకొనిన నా
యన! నీవు పోయి రమ్మా!
చనుకార్యము సఫల మగును సర్వేశుకృపన్. ౨౨

మ॥ అని దీవించిన సంభ్రమించి జనయిత్ర్యాజ్ఞానుసారంబుగాఁ
జనుచో "భూసురవర్యపాళికి నమస్కారంబుఁ గావించినా"
నన నాభూమ్యమృతాశనవ్రజము దీర్ఘాయుష్య మౌఁ గాక నీ
వెనుకన్ వత్తును మమ్ముఁ దోడ్కొనుచుఁ బోవే! రాజచూడామణీ!
౨౩

చ॥ అన విని వారికిన్ దగినయానములన్ నియమించి విస్ఫుర
ద్ఘనమణిచిత్రకాంచనవికారకసచ్ఛిబికాధిరూఢుఁ డై
వినుతయశోధురంధరుఁడు వీధుల నేఁగఁగఁ బౌరకన్యకా
జనులు నృపాలుమీఁద నెగఁ జల్లిరి లాజసుమాక్షతావళుల్. ౨౪

వ॥ ఆసమయంబున ౨౫

సీ॥ "ధరఁ గీర్తిమంతు లీదొరతోడ సాటి యే
దొరలు లే"రనుచు భూసురులు వొగడ
"నల రాజు వలరాజు నలరాజు నీరాజు
సాటి రా" రని వారసతులు వల్కఁ;
"వహ్వా శబాషు సవారీ షుజాయత్కి
డౌలు జే"ఖనుచుఁ బఠాను లనఁగ;

"దానధురీణ! మదద్విడ్విదారణ
చణ!" యని మాగధ స్తవము సెలఁగఁ;

తే॥ గీ॥ గాఢాళోదగ్ర భేరీ నికాయరవము
దస్యురాజన్యహృదయ భేదన మొనర్పఁ
బూర్వరద్వారసీమ నాభూమివిభుఁడు
వెడలె నిజయశోమహిమ నల్గడలఁ జెలఁగ. ౨౬

కం॥ అతిసత్వరగతితో భూ
పతి పోవుచు నచటిచిత్రపాదపవల్లీ
ప్రతతుల మృగఖగఘన సం
తతులన్ గనుఁగొంచుఁ జేరె ధరతటమునకున్. ౨౭

కం॥ తనవెంబడిగా వచ్చిన
జను లందఱ నందె యుంచి జనవల్లభుఁ డం
జనగిరిపై కొకఁడే తాఁ
జని యొకగహ్వరముఁ గాంచె సమ్ముఖమందున్. ౨౮

కం॥ ఆగొల్లవారు సెప్పిన
దీగహ్వర మేమొ! చూత మిపు డనుచున్ దా
నేగి వసుమతీవల్లభ
నాగారి గుహాంతరంబునను దనయొమటన్. ౨౯

సీ॥ భక్తకోటికి నింతబంటి 'విరజ'యని
కటిఁ జూపె నన వామకర మెసంగ;
నీఁక లేదు వైకుంఠ మిది నిక్క మని చూపె

సనఁగ దక్షిణహస్తమును జెలంగ;
దీనఁ గిల్బిషలతల్ దెగ వేయఁ బూనెనో!
యనువిధంబున సహస్రార మమర;
నార్తరక్షణకీర్తి మూర్తిమంతముఁ జేసి
ధరియించె ననురీతి దరము దనర;

తే॥ గీ॥ మకరకుండల కేయూరమకుటకటక
ఘనవిభూషిత సంహాసంహాసనకలితుఁ
డీశ్వరుం డగు శ్రీవేంకటేశదేవు
నరవిభుఁడు గాంచెఁ గన్నులకఱవు దీఱ. ౩౦

చ॥ హరితనువారిదోదయమునందుఁ గృపారసవర్షధారలన్
గురియ నృపాలబాష్పజలకుల్యలచేఁ బులకల్ దనూరసాం
కురములునై సమస్తజనగోపనపుంస్పువ మాచరించుచున్
బరిమితి లేనిముత్ఫలము పండెను; భాగ్యము చెప్పశక్యమే! ౩౧

క॥ శ్రీరామేభాశ్యాంఘ్రిద్వయ
సారసముల కిపుడు నృపతి సద్భక్తి నను
స్కారము సేసిన, నొప్పెను
ధారుణి సద్భక్తి మూర్తి ధరియించె ననన్. ౩౨

క॥ నిటలతటన్యస్తాంజలి
పుటుఁడై పటుభక్తిహృదయభువనజకలితో
త్కటుఁడై సర్వేశ్వరు సం
తట నిటుల నరేశ్వరుండు స్తవ మొనరించెన్. ౩౩

## చూ ర్ణి క.

శ్రీమదరవిందమందిరాసుందరీకందుకాయమానసుందరప్రశస్తనిస్తుల నిస్తలస్తనస్తబకవిన్యస్తాస్తోకకస్తూరీపంకాంకితవక్షస్తల! సద్యోవిద్యోతమానవైశద్యానవద్య ఖద్యోతాంచితాఖర్వపూర్వోర్వీభృచ్ఛిఖరాయమాణచిరత్నరత్నప్రభాభాసమానాసమానకాంచనాంచన్మకుటఘటితోత్తమాంగ! భుజాంచలసంభృతసుదర్శనాబ్జమిత్రాజస్రసంవిధానసంతతవ్యాకోచలోచనమహోత్పలవిరాజితముఖరాజీవ! నిజభుజాంతరాళమహేంద్రశిలాసాంద్రచంద్రశాలాఽఽరోహణావరోహణార్థాంభోధిజావిరచితశ్రేణీవదాచరితత్రివళీమండితపిచండ! తటిత్పటలాఽయితకటీతటసంఘటితహాటకమయశాటికోదంచద్ఘనఘనాఘనోపమానాపఘనత్రయీసీమంతినీసీమంతసీమాంతబంధురసిందూరసందానితపాదారవింద! భక్తజనబృందమందిరాళిందామందసౌందర్యమందార! దీనకిల్బిషోద్ధతధ్వాంతప్రధ్వంసనసత్త్వోద్దామార్క! నమస్తే నమస్తే నమః. 38

సీ॥ శ్రీరమణాయ, సరీసృపశాయినే,
నారాయణాయ, సనాతనాయ,
విష్ణవే, కృష్ణాయ, విహగతురంగాయ,
శార్ఙ్గిణే, వరదాయ, శాశ్వతాయ,
చక్రాబ్జపాణయే, నక్రసంహారాయ,
హరయే, శుభాంగాయ, హరనుతాయ,
సరసఖాయ, జనార్దనాయ, పీతాంబర
ధారిణే, దైత్యవిధ్వంసనాయ,

తే॥గీ॥ భక్తపోషాయ, భవతమోభాస్కరాయ,
మథితకలుషాయ, మన్మథమన్మథాయ,
మురహరాయ, ముకుందాయ, మోక్షదాయ,
దేవపూజితదివ్యపదే, నమోఽస్తు. 3౫

ఉ॥ తోయదమేచకాయ, సతదుష్కృతతూలసమీరణాయ, కృ
ష్ణాయ, గదాగ్రిజాయ, నభసాగమరాట్పురగాయ, పద్మనే
త్రాయ, బలానుజాయ, సురరాజముఖామరసన్నుతాయ, ని
త్యాయ, నిరంజనాయ, నిగమాంతశిఖామణయే, నమోఽస్తు తే 3౬

కం॥ రంకువు గలశశిశ్మశ్రుల
సంకలితము నీముఖంబుసరిఁ బోలక తా
శంకఁ బహుళక్షయతో
బింకము దిగనాడి సనుసె వేంకటరమణా! 3౭

కం॥ భవదీయదివ్యముఖసం
భవలలితశ్మశ్రుచయము పంకేరుహశా
త్రవకేతనమున కెన యగు,
వివరోన్నతజవనతురగ! వేంకటరమణా! 3౮

కం॥ వనజేషుశరాఽస్త్రము
లెన నీకనుబొమలతోడ నెటు లగు, గనుపుల్
గనుపులుగా గిరకల మెది
వినఁ బిప్పిగ విగస మాను వేంకటరమణా! 3౯

కం॥ మధుసూదనాప్రియం బగు
మధుయుతచాంపేయసుమము మహనీయభవ

త్రపథితోజ్జ్వలనాసిక కే
విధమున సరి వచ్చు ధీర! వేంకటరమణా! ४०

క॥ బింబము భవదీయాధర
బింబప్రతిబింబగరిమపృథురుచిఁ గని యా
డంబర మొందుచు శుకముఖ
బింబాంచితరక్తిఁ గనియె వేంకటరమణా! ४०

క॥ కుందంబులకుం దంబు ల
మంద భవద్దశనపంక్తి మహాసీయాలస
త్సుందరతరహీరామిత
బృందంబుల నపహసించు వేంకటరమణా! ४२

క॥ హరినీలఘటితఘనతట
సరసీలసదమలనలినసాదృశ్యభవ
ద్వరలోమగండతలములు
నెఱఁ గగుమొగ మెన్నఁ దరమె! వేంకటరమణా! ४३

క॥ నశకలభావాఽదర్శన
దృశమని నచియించు టెట్లు? దివ్యద్రాక్షా
శశిశకలద్వయసన్నిభ
విశదభవత్తాలుయుగము వేంకటరమణా! ४४

క॥ 'దర'నామకంబు నీకం
ధరసదృశతఁ బొంద లేక తావకవిలస
త్కరగతమై మొఱ వెట్టదె!
విరజాతరణీయచరణ! వేంకటరమణా! ४५

కం॥ తనమందిరమున నిందిర
ఘనముగ నిడుదీప మనఁగఁ గౌస్తుభరత్నం
బున నలరు భవద్వక్షము;
వినతాతనుజాతతురగ! వేంకటరమణా! ౮౬

కం॥ నిజజఠరపిఠరవిలుఠ
త్త్రిజగన్నిమ్నోచ్చసంధిరేఖలె లేఖా
భజనీయభవత్త్రివళులు
వృజినవ్రజదనుజహరణ! వేంకటరమణా! ౮౭

కం॥ కవిభవసంస్థానం బై
యవిరళహంసావలోకనాఽనందం బై
భవదురుగభీరనాభీ
వివరసరఃపద్మ మలరె వేంకటరమణా! ౮౮

కం॥ తావకమధ్యం బణు వని
కోవిదు లనఁ జిత్ర మయ్యె; గురుసంస్తుతులన్
బ్రావీణ్యానంతం బని
వేవిధములఁ బొగడఁ దగదె! వేంకటరమణా! ౮౯

కం॥ శ్రీద! జగత్త్రయభాగ్య
శ్రీదం బౌనీదుపదము శ్రీకాంతా న
మోక్షదము నై, ప్రస్తుతవర
వేదము నై, మమ్ముఁ బ్రోచు వేంకటరమణా! ౯౦

కం॥ తావకపదనఖజితతా
రాఽఽవళి కాంత్యన్వితంబు నై త్వన్ముఖదృ

గ్భావనచేఁ దారక లై
వే విష్ణుపదంబుఁ గనియె వేంకటరమణా! ౫

కం॥ ఇలలో 'మాధవుఁ' డనుని
ర్మలనామము నీకుఁ గలదు, మచ్చేతఃకో
కిల కులరింపుము తావక
విలసత్పదకిసలయముల వేంకటరమణా! ౫౨

కం॥ నీతనుదివ్యప్రావృ
ట్సీతాబ్జముఁ గని మదీయచిత్తమయూరం
బాతతముగ నర్తించును,
పీతామితకలుషనికర! వేంకటరమణా! ౫౩

కం॥ తావకతనువర్షాఽఽగమ
జీవనదకృపారసైకశీకరవరసం
భావితుఁ జేయుము మద్ధృ
త్వీవరచాతకకవీందు! వేంకటరమణా! ౫౪

కం॥ అమలము గద! పంకోద్భవ
కమలం, బావిధి మదీయకల్మషచేతః
కమలము విమలము త్వత్పద
విమలోజ్జ్వలకమలయుక్తి, వేంకటరమణా! ౫౫

కం॥ ఛదములు సెడకుండఁగ ష
ట్పద మబ్జాఽఽసవముఁ గ్రోలుభంగిని యుష్మ
త్పదనలినాఽఽసవమును నా
హృదయమిళిందంబు గ్రోలు వేంకటరమణా! ౫౬

మ॥ భవదీయోజ్జ్వలపాదపద్మయుగముల్ బద్మాసనాబ్జారిభృ
త్సవభుఙ్ముఖ్యసురుల్ మునీంద్రులుఁ గనన్ జాలంగ లే రంచు శ్రీ
ధవ! వేదార్థము దెల్పు చుండుఁ గద! దృగ్ద్వారిద్ర్యముల్ దీఱ నీ
భువి నేఁ జూడఁగ నేమి సేసితినో! కా పూర్వంబునన్ బుణ్యముల్. ౫౭

కం॥ వారటయుగ, కిరి, హరి, వటు,
పారశ్వధిక, నృప, సీరి, బౌద్ధ, సుకల్క్యా
కారంబులు ధరియించిన
శ్రీరమణుఁడ వీవె కావె! శృంగారనిధీ! ౫౮

మ॥ రసనాయుగ్మసహస్రముల్ గలిగి సర్పస్వామి వేనోళ్ళ నీ
యసమప్రౌఢచరిత్రముల్ వినుతి సేయన్ బూని తా నంతటన్
బస లేకుండఁగ సెజ్జ యై గొడుగు నై భద్రాసనం బయ్యె;నే
రసనన్ గల్గితి నొక్కఁడే; యెటులు నిన్ బ్రార్థింతు విశ్వాత్మకా!
౫౯

కం॥ అనుచున్ వినుతించిన విని
వనమాలి నృపాలుఁ జూచి వార్షికఘనగ
ర్జనసన్నిభబంధురస
స్వనమున ని ట్లనుచుఁ బల్కె సదమలకృపతోన్. ౬౦

కం॥ ఓనరవర! నీ వెవ్వఁడ
వీనగగహ్వరము సొరఁగ నేటికి నీకున్?
మానవరూపముఁ గనుఁగొన
కే నుందు మునీంద్రవృత్తి నిచ్చట ననిశన్. ౬౧

తే॥ గీ॥ సకలమానవహృజ్జలజాతపీఠి
కాఽంతరాఽవాసమును గల్గి యబ్జనాభ!
మునిజనులవృత్తి కెల్లను మూల మైన
దేవతాసార్వభౌముఁడ వీవె కావె! ౬

కం॥ అనిన న్నీనామం బే
మని యడిగిన "రాముఁ"డందు రవనిజనంబుల్,
వనజోదర! నీపదయుగ
వనజంబులసేవ సేయ వచ్చితి ననినన్. ౬

కం॥ కరుణానేత్రాంచలములు
నరవరుపై నిలిపి శౌరి నగుమొగమున భూ
వర! నిన్నొకమాటడిగెద,
వెఱఁ గొందక దీనిఁ దెల్పు విమలమనీషన్. ౬

శా॥ సద్యఃఫుల్లవిశాలనేత్ర విలసచ్చంద్రాఽస్య సౌందర్యజి
ద్విద్యుద్వల్లరిఁ గౌముదీస్మితఁ గనద్వేణీజితాంభోధరన్
హృద్యోదంచితనూత్నవిస్ఫుటలసద్దేమాబ్జహస్తోజ్జ్వలన్
మాద్యద్దంతిసమానయాన నలమేల్మంగాఽంగనన్ జూచితే? ౬

కం॥ చెలితో నే నొకమాటకు
నలిగితి; నీపర్వతమున కరుదెంచితి; నే
నిలఁ జాల నేమి సేయుదు
నలివేణిన్ విడిచినదిగ నవనీనాథా! ౬

కం॥ ఒకనిమిషం బొకదివసము,
నొకదివసం బొక్కనెలయు, నొకనెల యొకయేఁ,

డొకరో డొక్కయుగంబును,
నొకయుగ మొకకల్ప మగుచు నున్నది సుమ్మా! ౬౭

చ॥ మధురిమధూర్వహాక్షరి సమాధురిధారలఁ బల్కు పల్కినన్
మధురశరాసఘోటకసమంబు; విధుంతుదవేణి పాడినన్
బ్రథితవనప్రియావళిసమంబు; మదద్విపయాన పిల్చినన్
విధికృత మేమొ! కాని యల వీణెలతో సరి సేయఁగాఁ దగున్ ౬౮

క॥ అఘనకుచకచమేచక
మే ఘన మని నమను రాక మిహిరాపత్య
శ్రీఘనధుని భువిఁ బాఱెను,
మేఘము దివి కేగెఁ బొగడ మెలతను దరమా! ౬౯

క॥ తనచే నాచే రెండును
నొనరఁగ మత్పదమునందు నొక్కటి నిలిచెన్
వనితాముఖగళపదసమ
మును గాలే కబ్జములును మూఁడు నృపాలా! ౭౦

తే॥ గీ॥ కాంతకనుదోయి కెన గాక చింత నొంది
కంధరాద్వయసమునకబంధములను
నొక్క రాజీవమును నిల్పి యొకటి నిండ
మునిఁగి తేలుచు ఘనతపంబును నొనర్చె. ౭౧

చ॥ ఉదధిజ పుట్టినప్పుడె సముజ్జ్వలనామము శ్రీ యటంచు నీ
మదగజయానకే తగు సుమా! యని పార్శ్వములందు శ్రీలఁ దా
ముదము దలిర్ప గుర్తులు సముద్రుఁడు వ్రాసినచంద మొప్ప నా
ముదితశ్రుతిద్వయంబు సుకపోలములన్ సిరి నింపఁ జేయుచున్. ౭౨

చ॥ మగువసుధారసాధరసమప్రభ నొందెద మంచుఁ గెంపులున్
బగడములున్ బ్రవాళము లపాస్తరుచిత్వము నొంది నిల్వ చె
క్కులఁగఁ బడి, తంతుసంతతులకట్లకు లోనయి, నేల వ్రాలె; న
య్యగణితరూపగౌరవమహాద్భుతసంపద చెప్ప శక్యమా! ౭౭

సీ॥ పణతిముఖము మహాపద్మసంకాశంబు,
సతినేత్రములు పద్మసన్నిభము లు,
చంద్రాననకంఠంబు శంఖసమానంబు,
రమణిజంఘలు మకరములఁ బోలుఁ,
గామినిపాదముల్ కచ్ఛపసమములు,
కోమలిదంతాళి కుందపాళి,
బాలికకచములు నీలోపమానంబు,
లమరఁగా నిధిసప్తకమువిభూతి

తే॥ గీ॥ సంగములఁ బూనియును ముకుందాభిధాన
నిధినిఁ దనయందుఁ బూనదు నీరజాక్షి.
వర 'ముకుంద' నామమున నేఁ బరఁగు చునికి;
స్త్రీలు వరుపేరు నుడువను సిగ్గుపడరె? ౭౮

తే॥ గీ॥ వజ్రహారాన్వితం బైన వనితకుచయు
గంబుతోడను దుల్యంబు గాఁ దలంచి
వజ్రనిర్భిన్న మై నగవ్రాత మిలను
గూలి, ధృతి దూలి, గతి మాలి, జాలి నొందె. ౭౯

కం॥ నిజమె కద! కౌను సన్నము
గజయానకుఁ గల్గి యుంట, కచకుచజఘన

వ్రజనిజభారముచే న
య్యజకృత మది యేమొ! తాళు టది నిజమె కదా! ౨౬

కం॥ కాంచినిఁ గాంచిన నాసతి
కాంచినిఁ గాంచినసమంబె కద! హస్తిగిరి
పాంచితగతిఁ గుచగౌరవ
చంచద్వైభవవిలాససహితం బగుటన్. ౨౭

కం॥ కల నైనఁ గాని నన్నా
జలజాఽయతనేత్ర పాయఁ జాలక వక్ష
స్థ్సలమందే యుండును; నా
లలనను నేఁ జూడ కెట్టులను నిల్తు నృపా! ౨౮

ఉ॥ రామవసుంధరాఽధిప! మరాళవిరాజితయాన యిందిరా
రామకు నిర్నిమిత్త మపరాధము సేసినపాప మిప్డు నన్
గామశరస్వరూప మయి గాసిలఁ జేయుచు నున్న దయ్యొ! యా
మామహిళావతంసము నమందగతిన్ జని తోడి తే గదే! ౨౯

మ॥ అనుచున్ గేశవుఁ డాన తిచ్చిన నమందాఽనందచేతస్కుఁడై
మనుజాధీశుఁడు వల్కె నిట్లనుచు నామాఽమానినీరత్న మే
జనమాత్రుండను నాకు నెవ్విధము సాక్షాత్కార మౌ; నైన నా
మొను వైకుంఠముఁ బోయి పిల్వఁగను స్వామీ! నేను శక్తుండనే! ౩౦

వ॥ అనిన రమాధవుండు క్షమాధవున కి ట్లనియె. ౩౧

పంచచామరము॥ నృపాలచంద్ర! నన్ను బాసి నిల్చి యుండ నోపునే!
క్షపాదినంబు లెంచ కీరసాంద్రదేశమందుఁ దా-

నపారమోహమానసాబ్జ యై పయోధికన్య దీ
ద్వీపాధిరాజయాన మద్గవేషణం బొనర్పదే? ౧౨

తే॥ గీ॥ కాన నీ వేగి భూమిలోఁ గాననములఁ
బురములందును మునుల కాపురములందు
వెతకి తోడుక రమ్మ! యీ వెతకుఁ జాల
జాలి నొందెద; నిఁక నోర్వఁ జాల నయ్య! ౧౩

చ॥ అని తన వ్రేలిముద్రిక నృపాగ్రణిచేతికి నిచ్చి పచ్చవి
ల్తునివిషజాతతీవ్రతరదుస్తరశాతమహోగ్రబాణసం
జనితకరాళకీలలు రసాధవ! యోర్వఁగ లేను; ముద్ర యీ
వనితకు నిచ్చి తోడుకొని వచ్చిన నీ కొనఁ గూడుఁ బుణ్యముల్. ౧౪

కం॥ అనినంతనె నృపవర్యుఁడు
వినయంబున హరికి మ్రొక్కి వీడ్కొని చని యం
జనగిరినికటంబునఁ గల
వనజాకరతీరభూమివనముల నెల్లన్. ౧౫

కం॥ వెతకుచుఁ జని ముందట నొక
వితతోజ్జ్వలవిస్ఫుటారవిందామందా
యతజలజాకరమును భూ
పతి గనుఁగొని విమలసలిలపానేచ్ఛఁ జనెన్. ౧౬

శా॥ ఆకాసారసమీపభూమిని వయస్యారత్నముల్ గూడి నా
ళీకావాసవిలాసినీమణిని జాలిన్ దూల లాలించున

స్తోకాఽరావము నాలకించి సతు లివ్వో నెవ్వరో? యిందిరా
రాకారాజనిభాస్య యేమొ! యిటకున్ రాఁ బోలు నంచున్ జనెన్. ౮౭

కం॥ అంతట వచ్చెదుపృథ్వీ
కాంతుని శ్రీకాంత గని యకారణ మితఁ డీ
కాంతారమునకు వచ్చునె!
కాంతునిపనుపుననె వచ్చెఁ గావలె ననుచున్. ౮౮

మత్తకోకిల॥ రాజచంద్రునిరాకఁ గాంచుచు రాజసోదరియున్ సఖీ
రాజవక్త్రిను జూచి యి ట్లనె రామ! యెవ్వరో! కాని స
ద్రాజసన్నిభ తేజుఁ డీతనిరాక యెందుకొ? సౌరరా
డ్రాజభక్తనిభప్రభావవిరాజమానుఁడు చూడవే! ౮౯

చ॥ సనకసనందనాఽదివరసంయమివర్యులలోన నెవ్వఁడో!
ఘనుఁ డటు గాకి యుండిన నఖర్వసుపర్వమునీంద్రచిహ్నముల్
మనుజుల కేల కల్గు? ననుమానములే దితఁ డచ్యుతాంఘ్రిజీ
వనరుహభక్తుఁడే! నిజము; వారిజనాభుఁడు పంపెఁ గావలెన్. ౯౦

కం॥ అని యివ్విధమునఁ జెలితో
ననుచుండఁగ భూవరుండు నల్లన నికటా
వనికిన్ జనినను గని శ్రీ
వనితామణి పల్కె నిట్లు వసుధాఽధిపుతోన్. ౯౧

కం॥ పేరేమి? నిన్ను జూచిన
ధారుణిపతి వనుచుఁ దోఁచె ధరణిస్థలిలో

మారమణునిఁ జూచితివే!
కూరిమితోఁ జెపుము వేఁడుకొనియెద ననినన్. ౯౨

క॥ నా పేరు 'రాముఁ' డందురు
భూపతికులజుండ; దేవపూజ్యుం డదుగో!
నీపెనిమిటి గలఁ డమ్మా!
యీపర్వతగహ్వరమున నిందునిభాఽస్యా! ౯౩

క॥ అని హరి తన కిచ్చినయా
ఘనమణిసంచయయుతోర్మికను నిందిరకున్
వినయంబున నొసఁగుచు నా
జనపాలుఁడు సాఁగి మ్రొక్కి సన్నిధి నిలిచెన్. ౯౪

ఉ॥ ఆనవరత్ననూత్నఘటితాంచితకాంచనచంచదూర్మికన్
మానలినాక్షి గైకొని జనార్దనునంగుళిభూషణంబ! యా
వీనతురంగపుంగవుఁ డహీనశయానుఁడు లెస్స యుండెనే?
తా నెట నున్నవాఁడొ! యిఁక దాఁపక తెల్పవె! నిన్ను వేఁడెదన్. ౯౫

చ॥ హరి నిను వ్రేల నుంచుకొని యంబుధిలో వటపత్రతల్పమం
దరుదుగ మోళిక్రిందఁ దనహస్తముఁ జేరిచి పవ్వళించున
ప్పటి భవదీయసంగమునఁ దా జలరాశివతంసుఁ డమ్మెయిన్
ధరణి 'సముద్రుఁ' డంచు నభిధానము నందెను ముద్రికోత్తమా! ౯౬

॥ ఇవ్విధంబున నమ్ముద్రుటుంగరంబును గరంబు వినుతించి కన్నుల నొత్తి
కొని చెక్కుల హత్తించి యక్కునన్ జేరిచి యక్కువలయాక్షి
మిక్కిలిమక్కువతో ని ట్లనియె.

శా॥ నే నే మంటి విధాతృతాత! నప్పుడున్ నీవే కదా! సాక్షి తా
నే నామీఁద దయావిహీనమతి యై నిష్కారణంబే ననున్
దీనత్వంబునఁ గుందఁ జేసెఁ గదవే! దివ్యోర్మికారత్నమా!
నే నేరీతిఁ దరింతు మన్మథశరాగ్నిస్ఫారకీలావళిన్? ౯౮

కం॥ అని మఱియు రాజపుంగవుఁ
గని నీరేజశయన యనఘా! నిను 'నే
మను' మని హరి దాఁ బనిచెను
వినిపింపు గదయ్య! రామవిప్రులాధిపతీ! ౯౯

కం॥ దానేనసూను! సూనవి
తానేషుసమానరూప! ధరణీభృన్మౌ
ళీనాతిధీర! ధీరజ
నానూనసరోజషండహారి! హరిశౌర్యా! ౧౦౦

కం॥ శేషాహిరాజశయనువి
శేషాంచితవార్తఁ దెలిపి చిత్తాంబుజసం
తోషముఁ గావించితివి వి
శేషగుణకలాప! రూపజితసుమచాపా! ౧౦౧

కం॥ నిను గన్నతల్లిదండ్రుల
ఘనతరపుణ్యప్రభావగరిమం బిలలో
వినుతింపఁగ ననిమిషవర
వనభవభవభవుల కైన వశమె? కృపాలా! ౧౦౨

శా॥ అన్నా! రామనరేంద్రచంద్ర! హరి యే మన్నాఁడో! కా నన్నుర
మ్మన్నాఁడా? దయతోడఁ దెల్పగద వయ్యా! వేఁడెదన్ నిన్ను నా

యన్నా! నీవుయశోధురంధరుఁడ వై యశ్రాంత మీభూమి శ్రీ
మన్నారాయణపాదభక్తిఘనసామ్రాజ్యుండ వై యుండుమా! ౧౦౩

క॥ రమ్మనెనా? నాదే నే
రమ్మనెనా? తనకు నాకు రమణుం డిఁక దూ
రమ్మనెనా? నను మఱిహా
రమ్మని హరి తనభుజాంతరమ్మునఁ గొనునా! ౧౦౪

వ॥ అనిన రమాకాంతకు క్షమాకాంతుం డి ట్లనియె. ౧౦౫

క॥ అమ్మా! నిన్నుఁ ర మ్మనె
నమ్మా! యామాధవుండు ననుమానము లే
దమ్మా! మదిలో నిజ మను
కొమ్మా! నామాట నమ్ముకొమ్మా! కొమ్మా! ౧౦౬

క॥ రా వమ్మా! పోవుద మిఁక
నీవల్లభుఁ డెదురు చూచు నీరాకకునై
భావభవాంబకపీడిత
భావుం డై; వేగ పద వె! పదవుల సుదతీ! ౧౦౭

వ॥ అనిన రమాదేవి యి ట్లనియె. ౧౦౮

క॥ వనమాలి "నాకు ననపా
యినివి నిన్నెఁ బాసి యుండ నిది నిక్కము గా
మనమున నమ్మ" మటని నను
దనయెదఁ జేర్చుకొని మాటఁ దప్పినమీఁదన్. ౧౦౯

తే॥ గీ॥ ఏమి చేతును? నే నిఁక రామభూప!
దైవ మిం తైన దయ లేక తప్పు లేని

మాట చేపట్టి నన్నొంటిపాటు విడిచి
చనియె నిఁక నేను వచ్చినఁ జక్క నగునె? ౧౧౦

తే॥ గీ॥ అనుచు నీక్షితిఁ బల్కి యవ్వనజభవన
మనుజవరునకుఁ దనచేతివనజ మిచ్చి
"దనుజహరునకు నొసఁగుచుఁ దనుజవనజ
ఘనశరాళికి నోర్వ లే" ననుచుఁ జెపుము! ౧౧౧

వ॥ అని యివ్విధంబున నిందిరాదేవి వల్కిన "శ్రీమన్నారాయణుండు నన్ను మన్నన సేసి యక్కన్నియ యొద్దున్న వెనకి తోడుక ర" మ్మనియె; నిప్పు డీయమ్మ రాను సమ్మతింపక "శ్రీమన్నారాయణు నారక పో" మ్మను చున్న "దమ్మాధవునకు మనంబు సమ్మతంబుగా నెవ్విధంబునఁ జెప్ప వలయు" ననుచుఁ జెంతఁ జింతాక్రాంతుం డై నిలుచున్న భూకాంతునకు శ్రీకాంత వెండియు ని ట్లనియె. ౧౧౨

చ॥ మనమునఁ జింత నొంది యనుమానము సేసెద వేల నయ్య! నీ
వెనుకనె వత్తుఁ గాని యరవిందదళాక్షుఁడు తప్పు లేనిదే
నను విడ నాడి మారనళినప్రదరంబులపాలు సేసి తాఁ
జనె నిఁక నేను వచ్చిన ననహ్యత నొందఁడె యప్పటంతకున్. ౧౧౩

తే॥ నీవె పో వయ్య! పోయి "నా నేర మేమి?
తప్పు లేనిదె మదనాగ్ని కొప్పగించి
చనితివే మాయదయ చాలు చాలు ననుచుఁ,
దోయజాలయ మిముఁ జాల దూఱె" ననుమ! ౧౧౪

క॥ అని యివ్విధమునఁ బల్కిన,
జననాథుఁడు మ్రొక్కి లేచి శశ్వద్భక్తిన్

జననీ! నీయాజ్ఞను నేఁ
జనిమొద సెల వొసఁగు మనిన జలజజ యనియెన్ ౧౧౫

క౦॥ ఈసారిమాత్రమునకున్
వేసారక పోయి రమ్ము వేగిర మిఁక నో
భాసురగుణరత్నాకర!
దాసావనధుర్యునకును దండము సెప్పుమా! ౧౧౬

చ॥ అనిన మహాప్రసాద మని యబ్జముఁ గైకొని సత్వరంబునన్
జనియె హిరణ్యభూమిధరసన్నిభ మై తనరారు చున్నయం
జనగిరిత్రోవఁ బట్టి; మును శౌరికి నారదమౌనిచంద్రుఁ డా
యనిమిషసూన మిచ్చుటకు నంబరవీధిని వచ్చినట్టులన్. ౧౧౭

ఉ॥ ఆనరనాథపుంగవుఁడు నబ్జముఁ గైకొని పోవు చుండఁ ద
త్స్నానమనోజ్ఞవాసనఁ గిశోరసమీరకుఁడు గొంచుఁ బోయి యా
దానవవైరిసన్నిధి నుదారతఁ జేర్చినయంతలో "రమా
మానిని వచ్చె నిక్క మనుమానము లే దిఁక" నంచు దిగ్గునన్, ౧౧౮

ఉ॥ లేచి సమస్తదిక్కులఁ జలీకృతపక్ష్మ విశాలనేత్రుఁ డై
చూచి రమావిభుండు నిజసుందరిఁ గానక యేమిమాయయో!
తోఁచదు, భామహస్తగతతోయజసౌరభ మెట్లు వచ్చె? నేఁ
జూచినఁ గాన రా దేచటఁ; జోద్య మి దేమొకో! యంచుఁ జింతతోఁ
౧౧౯

సీ॥ 'తనతల్లి నెడఁ బాసి చనె' నంచు మదనుండు
వనజాస్త్రములఁ బూని వచ్చె నేమొ!;

పద్మవాసనఁ గొని పద్మాశుభం బెఱిఁ
గించ మారుత మేగుదెంచె నేమొ!;
సతి నన్ను వెదకుచుఁ జనుదెంచి యీమహా
శిఖరిసమీపంబుఁ జేరె నేమొ!,
పిలిచినఁ దా రాక పృథ్వీశుచేతికి
లచ్చి నలిన మీయఁ దెచ్చె నేమొ!
తే॥ గీ॥ రాకయుండిన నీసరలోకమునకు
మాకరాంభోజకంజాత మేకతమున
వచ్చెనో కాని తెలియ దీవార్త యనుచు
నుండి నృపుఁడు దవ్వుల వచ్చుచుండఁ గనుచు. ౧౨౦

కం॥ ఏ మనె? నే మనె? నయ్యా!
రామావనిపాల! వేగ రా గమ్మర్జా
తామలగృహ యే మనె? ని
న్నే మను మనె? మఱియు నన్ను నే మనె? నయ్యా! ౧౨౧

సీ॥ కుశలమా! రమకు మాకుశలంబు నడిగి నీ
కు సెల విచ్చెన! బుద్ధికుశలధుర్య!
రమణి, మత్కంఠహారమణి, "శ్రీహరిదె నే
గ" మని దూఱెనె! ధరారమణసింహ!
రాజీవపద్మ, తారాజీవితేశాఽఽస్య,
రాజీవ మంపెనా! రాజరాజ!
దరి లే విరహాబ్ధిదరిఁ జేరు టెట్లు? సుం
దరి రాక యున్నఁ జౌదరికుమార!

తే॥ గీ॥ పుండరీకాక్షి నాదండ నుండకున్నఁ
గాండజాతాస్త్రికాండప్రకాండములకు
బెండువడి గుండె సెదరక యుండు టెట్లు?
మండలాధీశ! యేది వేదండగమన? ౧౨౨

కం॥ అని యివ్విధమునఁ బలుకుచుఁ
దనరాకకు నెదురుసూచు తార్క్ష్యధ్వజుచెం
తను జేరి మ్రొక్కి యిట్లనె
వనజము చేఁ బట్టి రామవ సుధాఽధిపుడున్ ౧౨౩

కం॥ దేవా! నీయాజ్ఞను జని
శ్రీవనితను జూచి నీవు సెప్పినయట్లా
దేవికి సంగర మొసఁచు
రా నమ్మా! 'నీవిభుండు ర మ్మనియె' ననన్ ౧౨౪

కం॥ మనమునఁ దన్ను విడిచి చనె
ననుఖేదము, పిలువఁ బనిచె ననుమోదము, రెం
డును బెనఁగొన వనజేక్షణ
కన్నుఁగవ నులివెచ్చనీరు గ్రమ్మఁగ ననియెన్. ౧౨౫

శా॥ అయ్యో! బూటక మేల? శౌరి నను ర మ్మన్నాఁడె! నేఁ జెల్లఁ బో;
నయ్యా! యెక్కడిజోలి; నీ వెవరో! యీయాశ్చర్య మే మందుఁ; దా
నయ్యో! నాయెడఁ గోపగించి దయ రవ్వం తైన లే కప్పుడే
యియ్యారణ్యముపాలు సేసి చని నేఁ డేలాగు నన్ ర మ్మనెన్ ౧౨౬

కం॥ తలిదండ్రులనా! యెఱుఁగఁడు,
కులగోత్రముఁ దెలియఁ డతఁడు, గుణహీనుం డై

చలపోరి పుణ్యజనముల
బలిమిని విధియించుఁ గఠినపాకియు మఱియున్. ౧౨౭

సీ॥ 'మేనమా' మని యించుకైన లో నెంచక
కంసభూపాలుని హింస సేసె;
స్త్రీ, బాల, యనియెడుచింత యింతయు లేక
తాటకగాత్రంబుఁ దఱిఁగి వేసెఁ;
దనపాదభక్తిసంతతపారవశ్యుఁ డౌ
పృహ్లాదుతండ్రిరూపంబు మాపె;
బాలకుం డని మది భావించి చన్నియఁ
బోయినపూతనప్రాలు పడంచె;
తే॥ గీ॥ బిచ్చ మడిగిన లే దన కిచ్చె బలియు
నతనిఁ బాతాళగతముగా నణఁగ ద్రొక్కె;
నింతనిర్మోహదేవున కేలఁ గరుణ
గల్గు నామీఁద నిది వింత గాక! యనుచు. ౧౨౮

తే॥ గీ॥ చంద్రబింబాఽస్య నిను జాల చాల దాటి
"రాను బ్రొ మ్మిఁకఁ దనచేతిరవ్వ కోర్వఁ
జాల; హరిపొందు చాలింకఁ జాలు" ననుచు
నబ్జ మిచ్చెను మీ కి మ్మటంచు నిదుగో! ౧౨౯

మ॥ అనినన్ బంచశరమ్ము లొక్కమొగి నిష్వానంబునన్ గూర్చి మ
జ్జననిన్ బాసితి వంచు మారుఁడు మనస్తాపంబుతో నేసినన్.
వనజాతాక్షుహృదబ్జమున్ దగుల సర్వజ్ఞుండు నై మూర్ఛఁ జెం
దినచందంబున దివ్యశయ్య నపుడున్ దేహంబుఁ దాఁ జేర్చుచున్. ౧౩౦

ఉ॥ హా! యని కన్ను మూయు; నహహా! యని నవ్వు, నిఁ కెట్లు సేతు న
య్యో! యని మోము వంచు; మన సోర్వ దహో! యని చింత నొందు;నా
హా! యని వేగ లేచుఁ; జెలియా! యని దిక్కులు సూచు; వేగ రా
వే! యని పిల్చు; నుస్సు రను; వేసరుఁ;దా శయనించుఁ బాన్పునన్. ౧౩౧

కం॥ హరి యివ్విధఃమునఁ గేవల
నరుచందము వెతల నంది సరనాథునిచే
సరసీరుహామున్ గైకొని
కర మరుదుగ నిట్లు వల్కెఁ గమలముతోడన్. ౧౩౨

సీ॥ దర్పకోద్దండదోర్దండమండిత కాండ!
కాండరుడ్జాండాఽదికారణంబ!
తత వై యుతవిరాజితమహోన్నతహంస!
హంసోదరైకరిరంసహృదయ!
భవశిరోభ వధునీభ వనవాంబుజరాజ!
రాజానుజాతాతిరమ్యధామ!
మధురసన్మధురసోన్మదయుక్తబంభర
భరణ! విభ్రాజితభర్మగర్భ!

తే॥ గీ॥ శారదా, శార, శరదభ్ర, చంద్ర, చంద్ర,
చంద్రికా, సాంద్రచంద్రోప, లేంద్రసామ
జేంద్ర, నిస్తంద్రభుజగరాజేంద్ర దేహ!
లసదమితశుభ్ర దేహోపహాసనధామ! ౧౩౩

కం॥ కమలాంక వదనకాతర
కమలాక్షినిభాక్షి విమలకమలాఽలయశ్రీ

కమలకు శుభమే కద! యో
కమలాన్వయకమల రాశికమలవిరోధీ! ౧౩౪

మ॥ రమ నీయందు జనించినందువలనన్ రంజిల్లు నీపోలికల్
విమలాఽస్యాక్షికరాంఘ్రియుగ్మములు భావింపంగ నాకన్నులన్
గమలాదేవినిఁ జూచినట్ల యగు ని న్గన్గొన్న నిక్కంబు సం
భ్రమ మందేన్ జుమి! సౌహృదజ్ఞ మిపు డో రాజీవరాజీశ్వరా! ౧౩౫

కం॥ చక్రాంగప్రియమవు గద!
చక్రాంకుఁడ సుమ్మి! నేను సరసీరుహాభూ
చక్రాధిప! న న్నాశ్రి
చక్రస్తనిఁ గూర్చి ప్రియము సల్పం గదవే! ౧౩౬

కం॥ అని వనజము నివ్విధమున
వినుతించి మురాసురారి వేసరి చింతా
వననిధినిమగ్నచేతో
వనజుం డై రాజవదన వనజముఁ జూచెన్.

ఆశ్వాసాంతము.

శా॥ రవివంశార్ణవసోమ! సోమసవభుగ్రాజాబ్జభూమస్కరి
స్తవనీయోజ్జ్వలపాద! పాదతలయోషాభూతపాషాణ! మా
నివరాంభోరుహపాణి! పాణిధృతనిర్ణిద్రారిమరద్వేషి! రా
జీవదారోద్ధతపత్రి! పత్రివరరాజత్సైంధవాఽరోహణా! ౧౩౭

ఉత్సాహ॥ ఖరసురారివరవిదార! కలితసారకాంచనో
త్కరనిశారదశశితారదరకరారవింద! సా
గరగభీర! నగసుధీర! ఘనవిసారకేతుసుం
దరశరీర! హారశారదసదళనశూర! భూవరా! ౧౩౯

గద్య.

ఇది శ్రీరామచంద్రపదారవిందమరందరసాస్వాదనతుందిలేందిందిరాయమానమానసతూముపంశక్షీరపారావారరాకాసుధాకర రామక్ష్మాపాలసుపుత్రపవిత్రచరిత్రాశ్రీణాం ధగ్రీర్వాణచణరామచంద్రావనీపాలవిరచిత శ్రీమదలమేల్మంగాపరిణయం బనుమహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము సంపూర్ణము.

ఓం

## చతుర్థాశ్వాసము.

క॥ శ్రీకోసలరాట్తనయా
లోకనవికచాబ్జ! శోకలోచన! విలస
త్పాకాహితలోకాహిత
లోకాహిఖగేంద్ర! సకలలోకనరేంద్రా! ౧

తే॥ గీ॥ అవధరింపుమ! యాటమీద సజ్జనాళి
యేమి సెప్పెను! సురసంయమీశ్వరునకు;
వినఁగ నవి మాకు వివరింపు విస్తృతముగ
సూత! సముపేతహరికథాఖ్యాతచరిత! ౨

క॥ అన సూతుఁడు శౌనకముఖ
మునికులతిలకులను గాంచి ముదితాత్ముండై
"వనజోదరుదివ్యకథల్
విన వలసితి రేని మీరు వినుఁ"డని పలికెన్. 3

ఉ॥ రామధరాధినాయకుని రాజనిభాస్యముఁ జూచి శౌరి "నేఁ
బాముని బట్టెదన్, జ్వాలను బట్టెద, నంగజునైనఁ గొట్టెదన్,
భామరో! నిన్ను బాయ నని బాసలు సేసెద నంటి" నంచు నా
శ్యామకుఁ జెప్పి పిల్వ మొకసారిక వేఁడెద నిన్ను భూవరా! ౪

మత్తకోకిల॥ అనుఁచు నానతి యిచ్చినన్ నిటలార్పితాంజలిబంధుఁడై
మనుజనాయకుఁ డిట్లు వల్కె నమందవాగ్విభవంబునన్

దనుజమర్దన! యివ్విధంబున దాసునిఁ బ్రీతిమాలఁగాఁ
జనునె? నీ విపు డాన తిచ్చిన సత్వరంబున నేగెదన్. ౫

కం॥ మీయాజ్ఞోల్లంఘనమును
జేయఁగ నే నెంతవాఁడ శ్రీవర! మును నేఁ
బోయిన రా నన్నెఁ గద! "వేం
చేయఁగవలె మీ రె యటకు శీఘ్రం" బనినన్. ౬

మ॥ హసనాంచన్ముఖుఁ డౌచు దైత్యమథనుం డాహ్లాది యై యిట్లు 'నే
ననమాస్త్రింబకుబాధ కోర్వక నితాంతాఽసక్తిమై వత్తునే
ననమానోజ్జ్వలబుద్ధిధుర్య! విన వయ్యా! యీశరామండలిన్
రసికుల్ విన్నను రామ రామ! నగరా! రామావనీపాలకా! ౭

కం॥ అటు గనుక నీవె చని యా
కుటిలాలకతో "మహోగ్రకుసుమాఽయుధదు
ర్ఘటపటుశరపీడితహృ
త్పుట మిఁక నెటు లౌనొ? చూచి పొమ్మను"మనుమా! ౮

చ॥ అనిన నమస్కరించి దరహాసమనోజ్ఞముఖారవిందుఁ డై
చనియె నదభ్రవేగజితసారథవాహుఁడు నై ముదంబుతో
జనవరుఁ డచ్యుతాంఘ్రియుగసారసభక్తినియుక్తనైజహృ
ద్వనజవికాస మొందఁ వనవాటికి నిందిర యున్న చోటికిన్. ౯

ఉ॥ పోయి సరోజమందిరకు భూవరుఁ డచ్యుతపాదనిశ్చల
ప్రాయదనాదలోత్కలితభక్తిహృదబ్జుఁడు మ్రొక్కె; నన్; హరి

ప్రియుసి గారవించుచు "సరీసృపవైరితురంగుఁ డే మనెన్?
నాయెడ నల్గినాఁడొ? కరుణాపరుఁ డై నను బిల్వ నంపెనో? ౧౦

కం॥ బొంకిన నఘ మనుచును బుధ
శంకరు లను చుండ వినవె! జననాయక! మీ
నాంకగురుం డే మనెనో?
బొంకక నాతోడఁ దెల్పి పుణ్యముఁ గనుమా!" ౧౧

కం॥ అన విని జననీ! నీ విటు
లనఁ దగునా! దాసజనుని; నచ్యుతునావే
దన యే మని చెప్పుదు? "రా
ననె నిందిర"యనిన మూర్ఛ నప్పుడె చెందెన్. ౧౨

ఉ॥ అంతట మూర్ఛఁ దేరి నరకాంతకుఁ డల్లన జేతులన్ ధరా
కాంతపయిన్ ఘటించి తనుకంపము నొందఁగ లేచి "యింక నే
నెంతకు నోర్తుఁ గంతువిశిఖేషుపితాసనితాంతతాపసం
క్రాంతహృదబ్జ! మెట్లొ దయ గల్గినఁ గన్నులఁ జూచి పొ"మ్మనెన్ ౧౩

చ॥ "నిజముగ నేఁటినుండి యిఁక నిన్నడఁ బాయను నమ్ము"మంచునా
గజగమనాలలామకును గట్టిగఁ దెల్పుము; "నమ్మకున్నఁ బు
ణ్యజనచయఘ్న కిల్బిషము నందెద"నం చను; మిందు కాసతీ
వ్రజమణి యొప్పకున్న "వనవాసమె వ్రాసిన"దంచుఁ బల్కుమా! ౧౪

వ॥ అని మఱియు నిట్లనియె. ౧౫

తే॥ గీ॥ నిక్క మీమాట మాయమ్మ! నీవిభుండు
నీవు రాకున్న నిమిషంబు నిల్వఁ డచట

వచ్చు నీచెంత కిప్పుడె మచ్చెకంటి!
జాగు సేయక రావమ్మ! వేగముగను. ౧౬

క॥ అన విని "పుణ్యజనంబులు"
నన( గా విను యాతుధాను లయ్య! కృపాలా!
"వన" మన( గా నుదకంబును;
హాసననివాసముల కతని కవి యోగ్యము లే ౧౭

క॥ "మాధవు(" డనునామము మా
యాధవు( డై యునికిచేత నన వల సె( జుమీ!
యీధారుణి వేధస్సమ
మేధానిధు లతనిమాయ మి(చఁగ గల రే! ౧౮

॥ ఇతరజనవ్రజంబు క్షరణీశ్వరచంద్ర! "దరా౽దిశోభితా౽
యతకరిరాట్కరోపమభుజార్గళభూరితరప్రతాపని
ర్జితమహితామరాహితవరేణ్య(" డనంగ( బ్రసిద్ధు( డైనయ
చ్యుతుఘనమాయ దా(టుటకు( జోద్యము గాద(టె! యెన్ని భంగులన్ ౧౯

సీ॥ గీ॥ రామభూమీశ! హరిమాయ లేమి సెప్ప
నద్భుతంబులు; "సంజ్ఞులై నయట్టి
మునుల నెల్లర మోహితాత్ములుగ( జేసె"
నన్న నెవ్వానివశ మగు నన్న! యనిన. ౨౦

క॥ లే దమ్మా! "హరి మిథ్యా
వాదుండును గా(డు, సత్యవాక్యుం" డనుచున్

వేదంబులు వలుకును; మీ
పాదంబులతోడు పిలువఁ బనిచెను నిన్నున్. ౨౧

మ॥ నను జాలన్ బ్రియవాక్కులన్ బిలిచి శ్రీనాథుండు "నాయన్న! నా
వనితన్ దోడుక రమ్ము పొ" మ్మనిన నవ్వా! వచ్చితిన్, నీవు "రా"
ననుచున్ నన్ను నిరాకరించినను నే నచ్చోటి కేచందమున్
జనుదున్? "నన్ దయఁ జూచి ర" మ్మని నమస్కారంబుఁ గావించినన్ ౨౨

మ॥ శతపత్రాంచితపత్రలోచనము లాత్మాబ్జానిపై నిల్పి యో
క్షితినాథేశ్వర! నీమనోదృఢత, నీశీలంబుచే, నీమహా
ద్భుతనిశ్చంచలభక్తి, మెచ్చితిని; నీతోఁ గూడ నే వత్తు; న
చ్యుతుఁ డే మన్నను నీదె భారము సుమీ! క్షోణీసతీసాక్షి గాన్ ౨౩

కం॥ అని లేచి దిగ్గుమని యా
వనజాలయ చెలులు రామవసుధాధిపుఁడున్
దనవెంబడి రాఁగను సం
జనశైలారోహణంబు సల్పఁగఁ దొడఁగెన్. ౨౪

సీ॥ సెలయేటినీటిలోపల మోముఁ గని యుత్ప
లాంచితాబ్జం బని యందఁ బోవు;
మగఱాల నూగారుజిగినీడ గన్పింపఁ
గాలాహి యని చాలఁ గలువడించుఁ;
గలువరాచలుప మెట్టులఁ దోఁచుపదరక్తి
మము శోకనదము లన్ భ్రమ వహించుఁ;

దతసానుగత మైనతములతాద్యుతిఁ గాంచి
హైరణ్యభూధరం బని తలంచు;
గీ॥ నిందిరాకాంత హృదయేశసుందరాంఘ్రి
జలరుహార్చితనై జనుస్వాంత గాన
ముగ్ధచందానఁ దనతినూస్నిగ్ధరుచులు
దెలియఁ జాలక చనియెఁ గుత్కీలమెక్కి. ౧౫

కంఠీరవసమీపఘనసారతరువుల
నలరుచుండెడిమహాకిలభములను,
గాంచనసుమనికటాంచితాబ్జముమీఁదఁ
జెలరేఁగి విహరించునలికులముల,
సాంకవపరిమళాఽఽసన్న చంచద్బింబ
ఫలము లాసించెడిచిలుకగముల,
వల్మీకనిర్గతవ్యాళోగ్రభోగాగ్ర
ములఁ జెరించెడికోకములగణంబు,
గీ॥ నచలమునఁ జూచి చనుచుండునటులనుండు
నడుము, తొడలును, నడుపంద, మడలుముక్కు,
వదన, మలకలు, గంధంబు, పెదవి, పల్కు,
నాభి, నూగారు, కుచములు శోభిలంగ. ౧౬

| ఇవ్విధమున నృపుతో నా
జవ్వని యచలంబుపైకిఁ జనుదెంచునెడన్.
దవ్వులఁ గని ముసిముసినగు
నవ్వున వాక్రుచ్చుచుండె నగధరుఁ డంతన్. ౧౭

సీ॥ ఇందిరాలపనారవిందంబు సెలఁగెఁ గో
  విందదృగ్రవిభానువితతిఁ జూచి;
కమలాసతీనేత్రకుముదముల్ వికసించె
  స్వామిసుందరవక్త్రసోముఁ జూచి;
క్షీరాబ్ధిజావచఃకీర మానందించె
  మాధవాధరబింబమహిమఁ జూచి;
శ్రీతరుణీమనశ్చాతకం బలరె శ్రీ
  హరిదివ్యతనువారిధరముఁ జూచి;
తే॥ గీ॥ యీడు లేనట్టిమహాయనీడజార్వ
  జడధికన్యలు సంతోషపడుటఁ జూడఁ
  బుడమిజేఁ డైనరాముఁడు పూర్వజన్మ
  మునఁ దపం బేమి సేసెనో! మునివరేణ్య! ౨౮

కం॥ నారద! యీరీతిగ శ్రీ
  నీరదనిభవేణి వోయి నీరజనాభున్
  జేరి దరస్మితముఖవర
  సారస మలరంగ మ్రొక్కె సదమలభక్తిన్. ౨౯

మ॥ నీజనకుండు, నీసుతుఁడు, నీయనుజన్ముఁడు, నీవు, నెప్పుడున్
  రాజితజీవనంబు నభిరామమహోజ్జ్వలసుందరత్వమున్
  భ్రాజిత మానవప్రజము భాసురసంపదలెల్లఁ గల్గుచున్
  దేజము నొందుమీ! యనుచు దీవన లిచ్చె సరోజనాభుఁడున్. 30

కం॥ సదయుం డై కరముల నా
  మదవతి లేవంగ నెత్తి మందస్మితప

ద్వదనాంభోజాతంబునఁ
గుదినగొనఁగాఁ గౌఁగిలించుకొనిరా రమయున్. 30

ఉ॥ దేవ! మహానుభావ! నతదీనజనావళిఁ బ్రోవ దైవమే
నీవు గదా! యటంచుఁ గృతనిశ్చయ నై కలుషాత్మ లౌచు నీ
సేవ లెఱుంగ సట్టియవిశిష్టజనంబుల నెల్ల సత్కృపన్
గావవె!యన్నమాత్రమున నాయెడఁ గన్నడ సేయ న్యాయమా. 32

కం॥ నీమనసు రాక యుండిన
భామిని! యిది గూడ దనుచుఁ బల్కిన వినవే
నామీఁదఁ గోపగించుచు
స్వామీ! న న్నొంటి విడిచి చనఁగాఁ దగునే; 33

ఉ॥ దుర్గమశైలసంయుతము దుస్తరభూరిగభీరనిమ్నగా
వర్గనిరర్గళోగ్రమృగవారవిహారభయంకరంబు నౌ
మార్గముఁ బట్టి వచ్చి యసమానగిరీంద్రముఁ జూచి యీనగాం
తర్గతకందరాంతరమునన్ విభుఁ డుండు నటంచు నమ్ముచున్. 34

తే॥ గీ॥ ఈమహాపర్వతసమీపభూమి నొక్క
కమలల్హారకైరవకలిత మైన
విమలకమలాకరముఁ గాంచి ప్రమద మెసఁగ
నచట నుండఁగ సర్వాంసహావిభుండు. 35

చ॥ కరుణ దలిర్ప వచ్చి నను గాంచి నమస్కృతి సేసి "యమ్మరో!
హరి నిను బిల్వఁ బంపె" నని సాంజలి యై నను వేఁడ వచ్చితిన్;

బరమపవిత్రుఁ డీనృపునివల్లనె కాదె! భవత్పదాబ్జముల్
సరసిజనాభ! చూచితిని; సంతస మందితి వంత బాసితిన్ 36

చ॥ అని విని కేశవుండు "తరుణాబ్జదలాక్షి! కృపాఽర్ద్రచిత్త వై
ఘనకలుషాఽత్ము లైనజనకాండముఁ బ్రోవు" మటంచు వేడఁగన్
మనమున లేనికోప మొకమాటకుఁ గల్పన సేసి వచ్చినాఁ
డను సుమి! నీయభీష్టముఁ దటాలునఁ దీర్ప నృపాలుపాలికిన్ 37

కం॥ ఏలా! యంచును శశివిభ
ఫాలా! మది జాలి మాలి పడకయు వినుమా!
జోలిని వినఁగా నిది కడు
మే లాయె నటంచు నన్ను మెచ్చవె! బాలా 38

సీ॥ భక్తుఁ డై, వరతపోయుక్తుఁ డై, సంసార
ముక్తుఁ డై, మత్పదాఽసక్తుఁ డైన;
విహితుఁ డై, ఘనదానసహితుఁ డై, నిజయశో
మహితుఁ డై, కిల్బిషరహితుఁ డైన;
పూర్ణుఁ డై, గుణగణోదీర్ణుఁ డై, విద్యావి
కీర్ణుఁ డై, జ్ఞానవిస్తీర్ణుఁ డైన;
శాంతుఁ డై, మత్పరస్వాంతుఁ డై, వినయవి
శ్రాంతుఁ డై, సద్ఘృణాఽక్రాంతుఁ డైన;
తే॥ గీ॥ యీరసాఽధీశ కేసరిభూరిమహిమ
మెచ్చి వచ్చితి నిచ్చటి కిచ్చ పుట్టి;
యింక మన మిందు నుండినఁ బంకయుక్త
జనులు సేవించి ముక్తి కిఁ జనుదు రబల! 39

వ॥ అనిన ముదితాంతరంగ యై శ్రీదేవి యచ్యుతున కిట్లనియె. ౮౦

క॥ శ్రీహరి! యీమాటకు సం
దేహము! యీరామనృపతిదివ్యచరణ
వ్యూహము లభిరామంబుల్
మాహాత్మ్యము గల్గునితవి మున్నిరవు తగన్ ౮౧

చ॥ అన విని శౌరి రాజువసుధాఽధిపుమీఁదఁ గృపాకటాక్షసం
జనితసుధారసంబు నెగఁ జల్లి "రసాఽధిప! నీదుకోర్కె ని
త్తును దగ వేడు" మన్న, నతితుచ్ఛమనోరథ మేల నాకు? నో
యనఘచరిత్ర! నీశుభపదాంబుజముల్ గనుఁగొంటిఁ జాలదే ౮౨

ఉ॥ ఐన మదీయహృద్వనజమం దొకకోరిక యుండెఁ; నిచ్చిన
న్మానుని జేసితేని బహుమాన మి దెవ్వరి? దయ్యా! నీదెశా!
దీనశరణ్యా! యంచు నతిదీనత వేఁడిన శౌరి నూచి యో
మానవనాథ! వేఁడు మనుమాన మిఁ కేటికి? నిత్తు నిక్కముగ ౮౩

వ॥ అనిన ౮౪

క॥ సన్నుతి సేసెద రమయును
బన్నగశయన! నీవుఁ బరిణయ మైనన్
గన్నులఁ జూడఁగ వేడుక
యున్నది నను గరుణఁ జూచి యొప్పవె! యనినన్ ౮౫

క॥ బాలక! యీమదరోలుం
బాలకయును నేనుఁ బరిణయమ్ము [illegible]

నీలోకము చూడ్కి జయా
పాలోకము సేయుటకును సర్వమె! చెపుమా! ౪౬

కం॥ మనసునఁ గొద వేటికి? యిది
విని యాహ్లాదంబు నొందు వివరించెద; నీ
ఘనతర మగుచారిత్రం
బనఘం బై యొప్పుచున్న దది యెట్లన్నన్. ౪౭

సీ॥ అగణితపాంచరాత్రాగమంబునఁ గల
యర్థంబుఁ జెప్పెదఁ బార్థివేంద్ర!,
యస్మదర్చావిగ్రహంబులు నాలుగు
విధము లై యుండును బ్రథితముగను,
'నవి యెవ్వి' యన "స్వయంవ్యక్తంబు, దివ్యంబు;
సైద్ధంబు, మఱి మానుషంబు" ననఁగ,
నందు 'స్వయంవ్యక్త' మది మానిజవ్యక్తి;
యది దక్క నితరంబు లవనియందు

ఆ॥ వె॥ దివిజసిద్ధమనుజనివహంబు లెలమితో
దారు, జాతరూప, తామ్ర, రౌప్య,
శిలల నస్మదీయలలితవిగ్రహరూప
ముల నొనర్చి ముక్తిఫలముఁ గనిరి ౪౮

కం॥ శిల్పిగణముఁ బిల్పించి య
నల్పార్చావిగ్రహముల నతివిమలముగాఁ
గల్పింపఁ జేసి నీసం
కల్పం బీడేర్చుకొనుము! కుముదామోదముఖా ౪౯

చ॥ అన విని సంతసించి యచలాఽధిపవర్యుఁడు వాసుదేవ! నేఁ
జనియెద నాజ్ఞ యి మ్మనుచు సాగిలి మ్రొక్కినఁ బ్రీతితోడ నా
వనరుహనాభుఁ డాతనిని "వైళముగా నిజరాజధానికిన్
జని భవదిష్ట మేము? యది సాంగముగా నొనరించు"మం చనెన్. ౯౦

వ॥ ఇట్లు భగవదాజ్ఞఁ గొని, ౯౧

కం॥ మానవవర్యుఁడు భక్తిన్
పౌనఃపున్యప్రణామపరికలితుం డై
యానవినిర్జితఘనపవ
మానుం డై వేగ దిగియె మంజులనగమున్. ౯౨

కం॥ మును దా నచ్చట నిలిపిన
ఘనతరచతురంగబలముఁ గైకొని పురికిన్
జనియె, వనమాలితోఁ గడ
చినిముచ్చట సాప్తతతికిఁ జెప్పుచుఁ బిదపన్. ౯౩

కం॥ తిరుకల్యాణమహోత్సవ
పరికరముల నెల్లఁ గూర్చి పరిశుద్ధులు నా
వరపాంచరాత్రవేత్తలఁ
బరమాఽహ్లాదమునఁ బిలువఁ బనిచి ముదమునన్. ౯౪

కం॥ "బహులువాళ్లకు వచ్చితి" రని
బహుమానపురస్సరముగఁ బార్థివుఁడు దయా
సహితుం డై మణిభూషణ
సహితులఁ గావించి వారు సంతస మొందన్. ౯౫

హరితిరుకల్యాణోత్సవ
మిర వొందఁగ మాకుఁ జూడ నిచ్చ జనించెన్;
బరమాప్తులు మీరలు మముఁ
గరుణించి మహాత్ములార! కావింపఁ దగున్ ౫౬

అనిన విని యప్పాంచరాత్రాగమవేత్త లగుభూసురోత్తము లత్యం తసంభ్రమాయత్తచిత్తు లై, లలితవాక్యంబులఁ దజ్జలనిధిమేఖలాధిపసలలితముఖసలిలజం బాలోకించి, "భవదీయపూర్వకృతాగణ్యపుణ్యప్రభావసంపన్నశ్రీమన్నారాయణకారుణ్యకటాక్షలబ్ధప్రావీణ్యానైపుణ్యంబున నేతత్పుణ్యకార్యకర్తృత్వేచ్ఛ నీమనంబున నుదయించె; నొరుల కేల సంభవించు నిక్కార్యం? బఖర్వసుపర్వాధిపున కైన నంద రాని నిర్వాణరాజధాని చేరువ యై యుండుఁ, గావున నవశ్యం బాచరింప వలయు" నని యానతిచ్చిన; నృపాలోత్తంసుం డనల్పజ్ఞానాధికు లైన శిల్పకారులఁ బిల్పించి, సమంచితకాంచనతామ్రమేళనంబుఁ గావించి, శ్రీభూనీళాసహితంబుగా 'శ్రీనివా'సాభిధానవిగ్రహంబును విభాసుర పరిభాసింహాసనచ్ఛత్రచామరాద్యనేకమణిగణాగణితభూషణసహితంబుగా జగన్మోహనాకారంబుతోఁ గల్పించి, శశికాంతోపలాంతరాళశుకనాసికాముఖమంటపయాగశాలాద్యనేకమంటపప్రాకారంబులన్ గావించి యనంతరంబ:— ౫౭

స్యందనవిలసద్వినతా
నందనముఖవిమలవాహనంబుల నెల్లన్
సుందరముగఁ గల్పించి య
మందానందంబు నృపతి మదిలో నొందెన్. ౫౮

కం॥ కార్తాంతికవర్యుల సుము
హూర్తం బడుగంగ వార లుత్సాహముతో
నార్తజనవ్రాతావన!
కీర్తిమహోదార! యనుచుఁ గీర్తించి వేసన్ ౫౯

కం॥ పంచకరహితం బై, గ్రహ
సంచయము త్రికోణకేంద్రసంయుక్తం బై,
ప్రాంచద్వృషలగ్నంబున
నెంచఁగ రవి పదునొకండవింటఁ జెలంగన్ ౬౦

కం॥ అంచితతిథివారర్క్ష
సంచద్యోగకరణములు నలరుచు నుండన్
బంచాంగశుద్ధిగా నొక
మంచిముహూర్తంబు గలదు మనుజాధీశా! ౬౧

తే॥గీ॥ విన్నవించెద మాలగ్న మెన్నఁ దనిన
ఘనతరం బగుశిశిరర్తువునఁ జెలంగు
మాఘశుద్ధత్రయోదశీమందవార
మమితయోగ్యంబు నైయున్న దనిన నృపతి. ౬౨

ఉ॥ బంగరుకాగిదంబుల నృపాలకజాలముపేర "నిస్తులా
భంగళకాంగదంతిభటవాజిసమన్వితులౌచు మీరు సా
రంగవరప్రదాయియభిరామవివాహమహోత్సవంబుఁ జూ
డం గడువేడ్కతోడుతఁ దటాలున రం" డని వ్రాసి పంపినన్ ౬౩

కం॥ శిరమున నిడుకొని మదిలోఁ
బరమానందంబు నొంది పార్థివనివహం
బురుతరసత్వరగతితోఁ
గరితురగపదాతిరథనికాయాన్వితులై, ౬౪

ఉ॥ సింధురబృంహితంబులు, విశేషరథాంగరవంబు; లుల్లస
త్సైంధవహేషితంబులు, పదాతిజనోన్నతసింహనాదముల్,
బంధురమై చెలంగ నతిభాసురలీలల వచ్చి రందఱుం
గంధరసైంధవాదిసురకాండము విస్మయమంది చూడఁగన్ ౬౫

వ॥ అప్పుడు. ౬౬

కం॥ ఋత్విగ్గణనిపుణాగమ
సాత్వతచణబుధులఁ బిల్చి క్ష్మాపతివరుఁడున్
సత్వరమున ధీసంప
న్నత్వరబున నంకురార్పణముఁ జేయించెన్ ౬౭

మ॥ మఱునాఁ డుష్ణగభస్తి పూర్వనగరాణ్మౌళిన్ బ్రవేశింపఁగా
వరసంధ్యాజపహోమకృత్యముల నిర్వర్తించి భూదేవతల్
పరమోత్సాహముతో ఖగేశ్వరునిరూపం బంబరంబందు సుం
దర మొప్పన్ లిఖియించి చేసిరి మహోద్దామధ్వజారోహముల్ ౬౮

శా॥ భేరీతాడనపూర్వ మానిసిని భూభృద్బిమ్మఖద్యోచర
ద్వారాహ్వానము సేసి; రప్పుడు సురవ్రాతంబు భీతిల్లి "యీ
భేరీధ్వాన మిదేల పుట్టె" హరి దాఁ బేర్వేర దేవావళిన్
"రారమ్మం" చన హేతు వేమి! మనపై రానేమొ కాయంచనన్.
౬౯

క౦॥ ఆరేయి తెల్లవారిన
శ్రీరమణున కర్పితముగ క్షితిపతి విమల
స్ఫారాంచితషడ్రసయుత
సారాన్నం బిడియె నగ్రజన్మల కెల్లన్ 20

క౦॥ ఆనాఁటిరాత్రి గడచిన
భానుం డుదయంబు నంద బాడబులను స
న్మానించి వారిఁ గనుఁగొని
మానవనాథుండు పలికె మంజులఫణితిన్ 21

శా॥ భూసురవర్యులార! నరభోజనవైరివివాహలగ్న మీ
వాసరమందె యౌనుగద! వైళమ మీరలు నిత్యకృత్యముల్
చేసి సభక్తిచిత్తు లయి శీఘ్రముగా మఱి దేవపూజలున్
జేసుక పుష్కరాంచితవిశేషమహూర్తము దప్పకుండఁగాన్ 22

క౦॥ రమకున్ శ్రీమద్వేంకట
రమణునకును బరిణయంబు రాజితమతులై
భ్రమఁ జెందక సుముహూర్తం
బమలముగాఁ జూచి చేయుఁ డని యటమీఁదన్. 23

సు॥ వినతానందనవాహనంబుపయి నావిశ్వేశుఁ డై నట్టిశ్రీ
వనితానాథుని రామభూవిభుఁడు చెల్వం బొప్ప వేంచేయఁ జే
సిన నొప్పెన్; గనకాచలేంద్రవిలసచ్ఛృంగాగ్రమందున్ వికర్తనుఁ డావిర్భవ మైనచందమున విభ్రాజత్ప్రభాభూతిచేన్. 24

మ॥ తిరువీదిన్ జనుచుండఁగా నపుడు సాధ్వీరత్నముల్ భక్తిచే
వరనీరాజనపాణిపద్మ లగుచున్ బ్రహ్లాదముల్ మీఱ శ్రీ
హరిపైఁ బాడిరి మంగళారతులు నవ్యామోదమాకందపు
ష్పరసాస్వాదనతుందిలాళివిలసజ్ఝంకారనాదంబులన్ ౨౫

శా॥ మింటన్ జంటలు గట్టి దేవతలు స్వామిన్ జూత మన్వేడ్క వా
ల్గంటుల్ దంటగ వెంట నంటుకొని రాఁగా నిల్చి సద్భక్తితోఁ
గంటన్ జెప్పల నంట నీక ఖగరాట్స్కంధాగ్రసంరూఢుఁ డై
యుంటన్ జూచిరి కంటకాసురవిదారోదగ్రదోర్దండునిన్ ౨౬

సీ॥ నరకరక్షోరాజనిరసనంబును జేసి
ధరణిభారముఁ బాప నరుగునపుడు;
సురలకై మంథానధరణీధరోద్ధార
మును జేయఁ గృపతోడఁ జనినయపుడు
సాత్రాజితీశతపత్రనేత్రికి దేవ
భూజంబుఁ గొని రాను బోయినపుడు;
గర్వాతిదుర్వారపూర్వగీర్వాణాళి
నెల్ల హింసింపఁగా నేగినపుడు;

తే॥ గీ॥ పూర్వకథలను బతిరాట్సార్వభౌమ
వాహనారూఢుఁ డయ్యె నవ్వసరుహాక్షుఁ
డనుచు వినుచుందు మెప్పు; డీదినమునందు
మనము గన్నులఁ జూచితి మనుచు జనులు, ౨౭

క॥ అతికుతుకాన్వితు లై శ్రీ
పతిపదపంకజయుగంబు భాస్వురభక్తిన్
దతమతియుతు లై సురసం
తతిరీతిని తెప్ప లిడక తప్పక చూడన్. ౭౮

క॥ తిరువీదిన్ జని శ్రీహరి
తిరుగన్ జనుదేగ భూమిదేవాన్వితుఁ డై
నరనాథుఁడు హితనరవర
పరివృతుఁ డై యెదురుకొనఁగ భాస్వద్భక్తిన్. ౭౯

మ॥ స్ఫురదష్టాపదదివ్యరత్నరుచులన్ భూమ్యంతరిక్షాష్టది
గ్స్ఫురితం బై తగుచల్వచప్పరమునన్ బాథోధిరాజన్యకూఁ
తురు వందఁబుగ నుంచి వీధిఁ జనుచున్ ద్వారంబునన్ వచ్చుశ్రీ
హరిఁగన్గొంచు నదభ్రసంభ్రమమహీపాలోదయత్తు లై వేడుకన్. ౮౦

క॥ "మీ రెవ్వ? రిచ్చటికి రాఁ
గారణ మది యేమి? జలధికన్యామణి యీ
దారినిఁ దిరువీదికిఁ జను;
దారిని నిలువక యె మీరు తలఁగుఁ" డటన్నన్ ౮౧

వ॥ భగవద్దాసు లి ట్లనిరి. ౮౨

మ॥ తలఁగంగా నిటు వచ్చినార మె? సుధాధామానుజాతాంబురు
ద్వాలనన్నేత్రినిఁ బెండ్లి యాడుటకు నై వేంచేసినాఁ డంజనా
చలశృంగాగ్రగుహావిహారుఁడు గసచ్చక్రాబ్జదోర్ధాముఁడున్
జలజారాతిహితేక్షణుండు; త్రిజగత్స్వామిన్ దగన్ జూడుఁడీ. ౮౩

ఉ॥ చూచినవారిపుణ్యమును జూచెద మంచనువారిభాగ్యముల్
జూచినవారిరూపములు జూచినవారలకీర్తిసంపదల్
లోచనకర్ణరాడనలలోచను లబ్జభవుండు నాజగ
ల్లోచనుఁడుర్ ద్విపంచశతలోచనుఁ డైన నుతింప శక్తులే; ౧౪

కం॥ అది గనుక మీరె శ్రీహరి
పదములసన్నిధికి వచ్చి భాసురభక్తిన్
విదితముగ మ్రొక్కి నిలిచిన
సదయుం డై వచ్చు; నేమిసంశయ మనినన్ ౧౫

వ॥ రమాదేవిభక్తవరు లిట్లనిరి. ౧౬

తే॥ గీ॥ కావలసి యున్న నూచిన్నికన్నెకడకు
వారె వత్తురు; మే మేల నత్తు మచటి?
కెపుడు లక్ష్మిని జూతు మం చెదిరిచూచు
చుండి జాగేల? పిలుచుక రండు పొండు. ౧౭

కం॥ అనినంతనె వాదేటికిఁ
బనివడి వచ్చెదరు పెండ్లిప్రాయపుపడుచై
నను మీరె యెత్తుకొని మా
వనజోదరుకడకు నపుడు వచ్చెద రనుచున్ ౧౮

తే॥ గీ॥ ఉభయువాదులు నీరీతి నొకరి కొకరు
వేడుకకునయి మాటల నాడికొనుచు
నమితసంతోషచిత్తు లై యలరుచుండు
వేళఁ బలికిరి సిద్ధాంతవేదు లిట్లు ౧౯

తే॥ గీ॥ లగ్న మొక రెండుగడియ లాలస్య మైన
లేదు; మాటలఁ బ్రొద్దు నీలీల జఱుప
వలదు; రామనృపాలకవరునిఁ బూజ
సేసి తోడుక పోదము శీఘ్ర మనిన. ౯౦

చ॥ పరిమళ మొప్పఁగందవొడి పాణితలంబునఁ బూని శౌరిపై
సరసిజపాణిమేన జనసంఘము సల్లెను; రామభూవరుం
డురుతరకాంచనాంచితమహోజ్జ్వలరాంకవ మొప్పు కేశవున్
మురజముఖాదివాద్యములు మ్రోయఁగఁ దోడుక వచ్చి వేడుకన్ ౯౧

మ॥ ఘనవాహోపలవేదికన్ జెలఁగుచొక్కంపైన జాబిల్లిఱా
లను నిర్మించినపెండ్లిపీఁటలను శ్రీలక్ష్మీహృషీకేశులన్
వినయం బొప్పఁగఁ బంచరాత్రవిధులన్ వేంచేయఁగాఁ జేసి భ
ర్మనవీనాంబర యుగ్మ మిచ్చి మధుపర్కంబున్ సమర్పించియున్ ౯౨

కం॥ రంగన్మణిగణఖచితా
భంగోత్తుంగైకభవ్యభర్మమయం బౌ
మంగళసూత్రము నలమే
ల్మంగకుఁ గట్టించి రపు డమందప్రీతిన్ ౯౩

తే॥ గీ॥ లలితలావణ్యముక్తాఫలంబులు దలఁ
బ్రాలు వోసినఁ గేశవపద్మపాణి
మూర్ధములఁ జూడ నొప్పెను, ముదముతోడ
సురలు మందారసుమవృష్టి గురిసి రనఁగ ౯౪

సీ॥ మంగళం బలమేలుమంగకు; మహితతు
రంగదభంగవిహంగునకును;
భృంగసన్నిభనీలశృంగారధమ్మిల్ల;
కంగజకోటిదివ్యాంగునకును;
కుందకోరకరదనేందువక్త్రికు, లస
త్సుందరక్షీరాబ్ధిమందిరునకు;
మందిరద్విరేచారవిందకు; భాసురా
మందనిర్జరబృందవందితునకు;

తే॥ గీ॥ ననుచు మంగళారాత్రిక లమితభక్తిఁ
గంఠనిర్జితవిలసితాకుంఠనాద
కలితకలకంఠులై మహోత్కంఠ ఘటిలి
లలితకంఠులు వాడిరి యలఁత లేక ౯౫

కం॥ మఱునాఁ డరుణుఁడు వరుణుని
శరణంబును జొచ్చె; నంత సంధ్యావేళన్
సరవరుఁ డానందముతోఁ
గరదీపసహస్రచయము ఘనముగ వెలుఁగన్ ౯౬

ఉ॥ అంబరచుంబితైకకలశాగ్రచిరత్నసురత్నకాంతితో
సంబరరత్నదీధితుల నావలఁ ద్రోయఁగఁ జాలునట్టిది
వ్యాంబరజాలసంకలిత మై తనరారుప్రభాంతమందుఁ బీ
తాంబరధారి నిందిరను నందము నొందఁగఁ జేర్చి వేడుకన్ ౯౭

మ॥ తిరువీదిన్ జనుచుండఁగా నపుడు విస్తీర్ణప్రభోదగ్రుఁడై
యరుణుంతున్ నిజసప్తసప్తిరథుఁ డై యభ్రావరోహుండు నై

ధరణీభాగమునన్ జరించు ననుచందం బొప్ప, భవత్ప్రభా
వరరుగ్వ్యక్తరమేశధామము జనవ్రాతంబు వీక్షింపఁగన్ ౯౮

తే॥ గీ॥ తిరుగ శ్రీహరి వేంచేయ నరవరుండు
ధరణిసురులకు మఱునాఁడు పరమభక్తి
సరసమృష్టాన్నములు వెట్టి, చరమధరణి
ధరదరీవివరమునకుఁ దరణి సనిన ౯౯

శా॥ సౌరత్నోత్తమజన్మకేతనకనచ్చామీకరస్వచ్ఛవి
స్ఫారాంశుచ్ఛట లష్టదిక్కులను నాచ్ఛాదింపఁగా వేడ్కతో
సౌరధ్వానితరుక్మకుంభవిలసత్సౌందర్య మాస్యందనం
బారోహింపఁగఁ జేసె నిందిరను దైత్యధ్వంసినిన్ భక్తితోన్ ౧౦౦

ఆ॥ వె॥ స్యందనస్థుఁ డైన చక్రిని సేవించు
జనులు భువినిఁ దిరిగి జన్మ మెత్త;
రమృతపదముఁ గొందు; రానందమున నుందు;
రందు కేమి సందియం బటంచు. ౧౦౧

కం॥ దర్పకజననీజనకుల
కర్పించిరి సకలజనము లగణితభక్తిన్
గర్పూరారాత్రికలను
నేర్పునఁ గానుకలతోడ నిర్మలమతులై ౧౦౨

సీ॥ కంధిరాట్కన్యకాకలితవక్ష! పరాకు;
కర్బురసంహారకర! పరాకు;

పశుపతినుతదివ్యపాదపద్మ! పరాకు;
పన్నగారిధ్వజ! బహుపరాకు;
జఠరాంతరాలుఠజ్జలజజాండ! పరాకు;
స్మరశతకోటిసుందర! పరాకు;
పృషదశ్వాభక్తభుక్పింఛమౌళి! పరాకు;
సకలాఘవిషజాంగలిక! పరాకు;

తే॥ గీ॥ మిత్రశశినేత్ర! కర్బురచిత్రనేత్ర!
పత్రిరాజన్యకంఖాణ! వృత్రహరణ
నీలనిభగాత్ర! నీళాఽవనీకళత్ర!
బహుపరాకని మాగధుల్ ప్రస్తుతింప. ౧౦౩

సీ॥ రంభోర్వశీమేనకాఽంభోరుహాఽననా
సముదారసతులు లాస్యములు సలుప;
నిత్యసూరిప్రముఖానన్త్యగుణాఽఢ్యు లౌ
సద్వైష్ణవులు శ్రుతుల్ సదువుచుండ;
మణిగణోజ్జ్వలవిభూషణభూషితాంగు లై
ద్వాస్స్థవరు లగ్రభాగమునఁ జనఁగ;
భేర్యాదివాద్యగంభీరరావంబులు
కర్ణపేయముగ నాకసము ముట్ట;

తే॥ గీ॥ విమలకరదీపికావహావహ్నులు సెలఁగ
రామధరణీశసహితు లై భూమిసురవ
రాదిసర్వజనంబులు, మోదమునను
రథముతోఁ గూడి తిరువీధి రమణఁ జనఁగ. ౧౦౪

తే॥ గీ॥ చక్రిబాణంబు లలరెను "శక్రివైరి
చక్రి మీఁ రేయి ధారుణీచక్ర మవియు
శుక్రనిర్గతకీలోగ్రచక్రిచక్ర
మమితచక్రంబు లై వచ్చె" ననుచుఁ బొగడ. ౧౧౫

కం॥ ఆశాశబాణములు సుర
లోకసమీపమున కెగసెఁ; లోలాఽత్మకు లై
పాకద్విణ్ముఖవిబుధులు
చీకాకై "యింక నేమి సేయుదుము?" మనఁగన్ ౧౦౬

తే॥ పెట్లగోవులు బాణముల్ బిరుసులు మొద
లైన వన్నియు లంక యందు చమరఁ జేసి
సూత్రపుత్రిక నంజపిపుత్రిరీతి
నొవరఁ గావించి చిత్రిభాసుని రగుల్ప. ౧౦౭

చ॥ మును దశకంఠపూర్వరము మోదముతోఁ బృషదశ్వసూతి! పె
గినుకఁ గృపీటయోనిశిఖఁ గీల్కొనఁ జేసినయట్లు క్రేల్మిడిన్
ఘనబహుళస్ఫులింగములు గప్పుచుఁ బుత్రిక వచ్చి వత్తికిన్
గొనఁ దగిలించి పోవఁగ నకుంఠిత నేర్చిన నొక్కపెట్టునన్ ౧౦౮

మ॥ స్ఫురదుర్వీధరకందరంబులు వాఁరిచ్ఛందాలశూర్పశుత్రిత్రుల్
కరముల్ భేదిలఁ జేయుచవ్వఁకుల నాశాళిస్థలిన్ గప్పి దు
ష్కర మై తారలఁ దాకి రాలె ననుచందం బొప్పు నాశ్వరశ్రీలన్
నటపండోషాము సూమహాండ నవు దానక్షత్రబాణా2ఉత్థుల్ ౧౦౯

తే॥ గీ॥ ఇవ్విధంబునఁ దిరువీది నేగి మఱల
నరుగుదేరంగ మఱునాఁడు హరినిఁ దురగ
వాహనారూఢుఁ గావించి వైభవమునఁ
బాఱువేటకుఁ గాంతారపథముఁ బట్టి. ౧౧౦

చ॥ చని మృగయావినోదమును సల్పి నిశీథినివేళ వచ్చుచో
వనరుహపాణిసన్నిధినివాసుని శ్రీతిరుమంగయాళ్వా
రనియెడుచోరశేఖరుని నశ్వముమీఁదటఁ జేర్చి తస్కరుల్
సని హరిసర్వవస్తుచయసంగ్రహణంబును జేసి తెచ్చినన్ ౧౧౧

తే॥ గీ॥ చామరాదికభూషణజాల మెల్ల
సంగ్రహించుక చోరులు సనినఁ; జక్రి
లచ్చివాకిటిముందర వచ్చి నిల్చి
'తలుపుఁ దెరువు' మటంచును బలుకటయును. ౧౧౨

సీ॥ "ఇందు రాఁ బని యేమి యీ రేయి? మీ రెవ్వ?"
రన; "మీనరూపుఁ డీయనఘుఁ" డనిన;
"మీన మైన జలంబులోనె యుండు" నటన్నఁ;
"గచ్ఛపవేషుఁ డీఘనుఁ" డటన్నఁ;
"గచ్ఛపం బిలక్రిందఁ గాని యుండ" దటన్నఁ;
"గిరివర్ష్మధరుఁ డై నహరి" యటన్నఁ;
"గిరి విపినంబులోఁ దిరుగు" నంచన; "నర
హరి" యనన్; "హరి యైన, నద్రిగుహాస్థ

తే॥ గీ॥ వామనుఁడు బిచ్చ మెత్తును; వరకుఠారి
యడవి కేగును; 'రా' జన నాకసమున;
హాలి మహిఁ జిమ్ము; బౌద్ధుఁ డనగ్నిమతవర్తి;
'కలికి' యన్నను జిలుకలకొలికి గాదె". ౧౧౩

తే॥ గీ॥ అనిన "మృగయావిహారి యై యలసినాఁడు
తలుపుఁ దెరువుఁడి; హరియొ; మీ తలఁపులోని
కోర్కె లీడేర్పు" నన నొక్కకువలయాక్షి
వాకి లెడలించి హరికి నివాళి యిచ్చె. ౧౧౪

కం॥ ఘనమణికాంచనసింహా-
సనమున వరపాంచరాత్రశాస్త్రజ్ఞులు శ్రీ
వనితను హరి నుపవేశన
మొనరిచి హారతుల నిచ్చి రుత్సాహములోఁ ౧౧౫

తే॥ గీ॥ అంత మఱునాఁట నవభృథం బాచరించి
పుష్పయాగంబు రాతిరి పొసఁగ సల్పి
భూరిదక్షిణ లమితముల్ భూసురులకు
నొసఁగి భూపతి నిజకీర్తి నెసఁగఁ జేసె. ౧౧౬

కం॥ ప్రతివత్సర మిట్టులె శ్రీ
పతికల్యాణోత్సవంబు పార్థివవరుఁ డా
శ్రితవత్సలుండు భక్తిని
సతతము నొనరించుచుండు సందయకువలాక్షి! ౧౧౭

కం॥ రామనృపాలునిసోదరి
'రామమ్మ' యటంచుఁ గలదు; రాజితకీర్తి
సోమాంబుజభూవిలస
ద్భామామృతహైమధరవితానముఁ దెగడున్ ౧౧౮

కం॥ "అనసూయగుణగణంబుల
ననసూయయె యనఁగ వచ్చు; హరిపదయుగభ
క్తిని నల శబరియె సమ" యం
చనఁ దగురామమ్మతోడ నన్యులు సములే! ౧౧౯

కం॥ తమ్ముఁ డగురామభూవరు
నమ్మానిని సూచి పలికె "నమ్మకడుపునన్
నెమ్మిని మన ముదయించితి;
మిమ్మహి హరిసేవ సేసి యెసఁగితి వీవే. ౧౨౦

చ॥ ఘనమగుకీర్తివెన్నెలలు గాయ బుధాళిచకోరపాళి నిన్
వినుతి యొనర్చుచుండఁగను క్షేమము నే విని సంతసించి నీ
వనియెడునావతో భవమహార్ణవ మీఁదెద నంచు నున్నదా
నను; హరిసేవ సేయుటకు నాకు నుపాయము సెప్పవే" యనన్ ౧౨౧

వ॥ అనిన రామభూపాలుండు. ౧౨౨

కం॥ "అక్కా! కేశవసేవకు
మిక్కిలి నిఁక నేమి గలదు! మే లగు మఱి నీ
విక్కడ పూజనన్నిధిలో
నొక్కమహాగోపురము నొనరింపు" మనన్ ౧౨౩

క౦॥ శిల్పివరేణ్యుల నప్పుడె
పిల్పించి మహోజ్జ్వలైకపృథుతరఫణిరా
ట్కల్పమహాద్వారంబునఁ
గల్పించెను గోపురంబు ఘనతరభక్తిన్ ౧౨౮

సీ॥ "ఆధారరహిత మీయమరాలయ" మటంచు
ధాత పెట్టినపోటిస్తంభ మనఁగ;
"స్వామి నీక్షించఁగాఁ బ్రేమతో నేతెంచి
యలర నిల్చినహిమాచల" మనంగ;
"నమరాళినఘటంబు నమసి జల్లున దిగఁ
జారెడిఘనసుధాధార" యనఁగ;
"మురహరుభక్తాళిఁ బ్రోవంగ నిడినని
శ్రేయసాయుతవనిశ్రేణి" యనఁగ,

తే॥ గీ॥ శుభ్రతానిర్జితోజ్జ్వలాదభ్రశార
దాభ్రవిభ్రాజితాభ్రాపగాభ్రదంతి
శుభ్రవారిజమహితసితాభ్రదీప్తి
గలమహోదగ్రగోపురం బలరుచుండె. ౧౨౯

వ॥ అది మరియును దరుణతరణికిరణవిభవవిభాసమానానసమానసాలభంజి
కాపుంజమంజులకరకంజకలితనీరాజనదీపికోజ్జ్వలిత శాతకుంభ గంభీరకుం
భస్తంభవిరాజితంబును; నత్యుద్రమహార్ఘ్యతరరత్నమృగఖగజగత్తరుహవిచి
త్రవిచిత్రితావళిభాసమానపరితిమానితానఖచితభాసిత్రమాకంబును;
వజవలింబప్రతిబింబకరచిమ్మలతరముకురబింబప్రగితచతురాయకాంతిచ్ఛత్రి

క్షాప్రదేశంబును; దదుపరి సమస్తదిగంతరాళాంతరవికీర్యమాణహరిత కాంతిచ్ఛటాసముదయసపీఠమరకతవ్రాతపరిచ్ఛన్నవలభిభాగంబును; నిగన్నిగాయమానసగారాతినీలోపలజాలరచితసలలితవాతాయనవితానంబును; సాంద్రతరశరచ్చంద్రచంద్రికోపమానవజ్రోపలసంఘటితనిశ్శ్రేణీశ్రేణీయుతంబును; సంతతనిరీక్షణజనితవిస్మయానందకందళితబృందారకబృందహృదయారవిందాభ్రంకషశిఖరప్రకాశితంబును; సంభృతగదాదండనిరర్గళబాహార్గళశోభితజయవిజయపాలితబహిర్ద్వారోభయప్రదేశంబును నైనయమ్మహాగోపురద్వారంబున శ్రీమదంజనసగాగ్రరంజితుం డగుశ్రీమద్వేంకటరమణుండు శ్రీమదలమేల్మంగాంగనాసహితంబుగా సకలజనబృందంబులున్ జూడ నీడోద్భవాధిపారూఢుం డై తిరువీదిని వేంచేయుటకు నిర్గమించుసమయంబున; విభీషణగుణమణిగణభూషణుం డరిభీషణుం డై నతూముకులపయఃపారావారరాకానిశాకరుం డగురామస్వామిపాలుండు హస్తన్యస్తమంజులచామరప్రశస్తుం డై పార్శ్వంబునం జనుచుండ; వందిబృందంబులు వందనంబులు సేయుచుండ; వేత్రధరులు "వేత్రవతీభర్త! రతిస్వామి! బహుపరాకు! హెచ్చరిక!" యని కైవారంబులు సేయుచు సందడించుమందిని మురిదర నదల్చుచుండ; వారవనితాజనంబులు దమ కిచ్చు మెచ్చులకునై యుచ్చరమచ్చికంటులరీతి హెచ్చుగాం దమకు వచ్చినటుల విచ్చలవిడి నటించుచు, యువజనంబుల నచ్చికబుచ్చికలు సేయుచుం, బురోభాగంబునం జనుచుండం; జరమభాగంబున నందసునందసనందనబృందారకాచార్యులం బలె వేదపారాయణంబు సలుపుచు శ్రీవైష్ణవబృందంబులు సనుచుండం; గవినికరంబు విద్యోతమానగద్యపద్యవచనరచనాచాతుర్యంబులు నెఱపుచుండ; నారదతుంబురుపమానగాయకసముదయంబు గానమాన

వీథావంబుల గానంబు సేయుచుండఁ; బురజననివహంబులు స్వకీయసతీయుతంబుగా తెప్పలు విప్పక తప్పక చూచుచు గుంపులుగుంపు లై నిలింపులసొంపు దీపింపఁ "దోరం బగునిమ్మహాద్వారగోపురంబునిర్మాణం బొనర్చినవా రెవ్వరో!" యనిన; "సకలనృపాలమౌళి యగురామభూపాలుసహోదరియు, విబుధజనమందిరాళిందసుందరమందారారామ మ్మగురామమ్మ" యని యొకరి కొకరు చేతులన్ జూపుచు నరుదెంచునపుడు; భేరీధాంధణధంధణాయమానబంధురనినదంబు సుధాంధవిపరిపంథిరాజలోకంబు విని భయభ్రాంతచైతన్యు లగుచు "శక్రయుతంబుగా సవక్రపరాక్రమంబున సక్రోధుం డై చక్రి మనమీఁదఁ జక్రప్రయోగంబు సేయం జనుదెంచెనో!" యని శంకాంతంకసంకలితమానసు లగుచుండ; లెక్క సేయ నెవ్వారికి శ [illegible] గానియమ్మహాసేవావైభవంబు, స్వర్ధామంబురీతి ఖచరాధిప [illegible] వేష్టితంబు నై, గ్రహమండలంబుభాతి బుధశనైశ్చరయుక్తంబు నై, మానససరాసారంబుచెలువునఁ గవివాచావైలక్షణ్యంబు నై, బదరికాశ్రమంబుచాడ్పున నరనారాయణప్రకాశితంబు నై, యయోధ్యానగరంబువోలె రామావనీపాలపరిపాలితంబు నై, నాగలోకంబువిధంబునఁ జక్రిప్రకాశితంబు నై యుండె; నంత:— ౧౨౮

౧౹ గోపురవరమందిరమున
గోపురకలశముల ముద్దుఁ గొనుచున్నవి; యా
గోపురశిఖరాగ్రము లవి
గో! పురమునఁ జెల్లఁగునుఁ; గనుఁగొను! మునితిలకా! ౧౨౯

కం॥ అని యివ్విధమున నారద
మునిగణచంద్రుఁడు విశేషమోదయుతుం డై,
ఘనతర ఫణితిని శంభుఁడు
వినిపించిన విస్మయమున విని చనె స్వేచ్ఛన్. ౧౨౮

## ఫ ల శ్రు తి

సీ॥ ప్రాచీదిశాధీశ భాసురవిభవంబు,
స్వాహాసతీభర్త్రుసదృశశుచిత,
ధర్మరాజసమానధర్మగుణావాప్తి,
పుణ్యజనాధిపాగణ్యశౌర్య,
మంభోధిరాజనవ్యగంభీరభావంబు,
పృషదశ్వసంకాశపృథులబలము,
రాజరాజనిధానరాజమానధనంబు,
నార్యేశ్వరోజ్జ్వలైశ్వర్యకీర్తి,

తే॥గీ॥ శ్రీమదలమేలుమంగాపరిణయ మిలను
వినినచదివినవ్రాసినజనుల కెల్ల
శ్రీనివాసుండు నిచ్చు విస్తీర్ణకరుణ
ననుచు సూతుఁడు శౌనకమునికిఁ జెప్పె. ౧౨౯

## ఆ శ్వా సా ం త ము

శా॥ సోమార్కాగ్నిసుచక్షు శోభితమహాశోభాపూర్ణదివ్యాంగ! స
ద్ధామా! నర్మ శ్రీమణీగణపరిధితదివ్యాంబరసంధానితో
ద్దామజ్యోతిర్భవభూరిభద్రభయభ్రాంతుప్రోద్యగ్రశౌర్యాహిత
ప్రేమాంభోయుతహృత్సమూహాసురరాట్సన్నాత్యంఘ్రి
దివ్యాంబుజా! ౧౩౦

వనమయూరము.

అక్షరనృపోక్షకృతహాస్త్రవరరక్షా!
శిక్షితవిపక్షనరసీరుహనిభాక్షా!
వృక్షచరదక్షనత! శ్రీకలితవక్షా!
ఋక్షవిభులక్షణసమీరితకటాక్షా! ౧౩౧

గద్యము

ఇది శ్రీరామచంద్రపదారవిందమరందరసాఽస్వాదనతుంది
లేందిందిరాయమానమానసతూముమువంశక్షీరపారావార
రాకాసుధాకరరామస్వామిపాలసుపుత్రపవిత్రచరి
త్రాక్షీణాంధ్రగీర్వాణచణరామచంద్రావనీ
పాలవిరచితశ్రీమదలమేలుమంగా
పరిణయం బనుమహాప్రబం
ధంబునందుఁ జతుర్థాశ్వాసము
సర్వంబు సంపూర్ణంబు
ఓం

శ్రీ వాణీ ముద్రణాలయము, సుల్తాన్ బజార్, హైదరాబాద్ (దక్షిణ.)